# సప్తశతీ రహస్యాలు

## (కుండలినీ రహస్య సహితము)




రచన, సంకలనము :

G. V. L. N. విద్యాసాగరశర్మ, M.A.,

(రిటైర్డ్ ప్రభుత్వ డిగ్రీకళాశాల, ప్రిన్సిపాల్)



ముద్రణకర్త :

నోరి రాజగోపాలశాస్త్రి (U.S.A.)

సర్వస్వామ్య సంకలితము
ప్రథమ ముద్రణ
ప్రతులు : 1000

ఆవిష్కరణ :

1994 మార్చి 5
(శ్రీ విశ్వయోగి విశ్వంజీ జయంతి)

ప్రాప్తిస్థానం :

1. విశ్వమందిరం
3వ లైను, కృష్ణనగర్
గుంటూరు-6.

2. G.V.K.S. సాయిదత్త
S/o G.V.L.N. విద్యాసాగరశర్మ
5వ లైను, A.T. అగ్రహారం
గుంటూరు-4.

వెల : **10** రూపాయలు

ముద్రణ :
శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్
2/4, అరండల్‌పేట,
గుంటూరు-2.

ఓం శ్రీసాయిరామ్ గురుదేవదత్త

# విశ్వసందేశము

అన్ని జన్మలలోకి మానవజన్మ ఉత్తమమైనది. మానవజన్మ లభించుటయే దుర్లభము. అదృష్టవశముగా దివ్యవరముగా లభించిన మానవజన్మను మానవుడు సద్వినియోగము చేసికొనుటకు సక్రమముగా యత్నించవలెను. మునుముందుగా మనిషిగా నిలిచి, మనీషిగా మారి, మహాత్మునిగా, మహాశక్తిస్వరూపునిగా, సాక్షాత్తు మహేశ్వరునిగా దివ్యపథముపై పయనించాలి!

పరిపూర్ణ మానవత్వమే దివ్యత్వము. సనాతన ధర్మం మానవుని పరిపూర్ణ మానవునిగా తీర్చిదిద్దటానికి దోహదపడే మార్గం. ఇది ఒక ప్రాంతమునకో, మతమునకో సంబంధించినది కాదు. యావత్ మానవజాతికి, యావత్ మానవ కళ్యాణమునకు, యావత్ మానవజాతిసమైక్యమునకు మన సనాతన ధర్మం ఎంతయో అవసరము, ఆచరణీయము అయి ఉన్నది.

'వసుధైక కుటుంబము' అని చాటి చెప్పినది సనాతన ధర్మం. 'ఈశ్వరస్సర్వభూతానాం' అని ఎలుగెత్తి చెప్పినది సనాతన ధర్మం. 'ఏకం సత్, విప్రాః బహుధా వదంతి' అని చెప్పినది సనాతనధర్మం. 'మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ' అని మనిషి మనిషికి సందేశమిచ్చింది సనాతన ధర్మం. మనిషిని సంస్కరించి, కుటుంబవ్యవస్థను చక్కదిద్ది, గృహమును ప్రశాంతి నిలయము

ముగా మార్చి, తద్వారా యావత్ మానవ సమాజమును ఒక స్వర్గధామంగా, ఒక కలియుగవైకుంఠంగా, ఒక ఆనంద నిలయముగా మార్చటానికి మార్గదర్శకమయింది- సనాతన ధర్మం.

అట్టి సనాతనధర్మాన్ని విస్మరించి, వ్యక్తిని విస్మరించి, కుటుంబమును విస్మరించి, సమాజమును బాగుచేయాలని ప్రణాళికలు వేస్తున్నాము. కాబట్టి అన్నిటిలోను అపజయమును రుచిచూచి, ఇప్పుడు యావత్ ప్రపంచాన్ని ఒక అగ్నిగుండంగా, ఒక అశాంతి నిలయంగా దిగజార్చటానికి, నాగరికత పేర, విశృంఖల స్వాతంత్రతపేర, మితిమీరిన తెలివి తేటల పేర సహాయపడుతున్నాము. ఇది విచారించతగ్గ విషయం.

మొట్టమొదటిసారిగా మనిషి సంస్కరించబడాలి. కుటుంబము సంస్కరించబడాలి. తరువాత సమాజము దానికదే సంస్కరించబడుతుంది. సంస్కారముగల వ్యక్తులతో విరాజిల్లే కుటుంబములను, గృహములను కలిగిన సమాజము ప్రశాంత పరిమళములను విరజిమ్ముతూ ప్రకాశవంతముగా వెలుగొందుతుంది. విశ్వమానవ సమైక్యముతో సుసంఘటితంగా జీవిస్తూ విశ్వమానవ కళ్యాణాన్ని రుచిచూస్తుంది. ఇదే! ఇదే! ముక్కోటి దేవతల దివ్యసంకల్పం. ఇదే! ఇదే! సమస్తయోగుల, అవతారమూర్తుల, సిద్ధపురుషుల, మతప్రవక్తల సంకల్పము. ఇదే!ఇదే! సమస్త మానవజాతియొక్క- ఆశ, ఆకాంక్ష, ఆశయం, లక్ష్యం.

విశ్వమందిరం,
కృష్ణనగర్, గుంటూరు-6

దివ్య ఆశీస్సులతో
విశ్వయోగి విశ్వంజీ.

# సమర్పణ

సత్యం జ్ఞాన మనంతంగా

సత్యం శివం సుందరంగా

సచ్చిదానంద స్వరూపంగా

త్రిమూర్త్యాత్మకంగా

చిచ్ఛక్తిమయంగా

విరాజిల్లుతున్న

శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహారాజ్‌గారి

**50**వ జన్మదిన సువర్ణోత్సవాన్ని పురస్కరించుకొని

ఆ సమర్థ సద్గురువుకు

ఈ గ్రంథాన్ని భక్తిప్రపత్తులతో

సమర్పిస్తున్నాను.

—నోరి రాజగోపాలశాస్త్రి.



# పుష్పాంజలి

నీదు బొజ్జ నుండె నిఖిలమౌ విశ్వమ్ము
విశ్వమందిరాన వెలయు దీవు !
విశ్వమునకు నీకు భేదమ్ము లేదయ్య !
విశ్వయోగివర్య ! వినతులయ్య !

అత్రితపంబు మెచ్చుకొని అమ్మునినాథున కీవు దత్తమై
పుత్రుడ వైతివంట ! - జిగిబుగ్గల ముద్దులు మూటగట్టు నీ
చిత్రవిచిత్ర శైశవ విచేష్టితముల్ కనుగొంచు నెల్లరున్
చిత్రము లట్లు నిల్చిరట ! చేతులు మోడ్చుచు నాడు భక్తిమై !

ఉయ్యేలందున నిన్ను బజ్జుండ బెట్టి
అమ్మ లాలిపాటలు పాడు నవసరమున,
కొంటె నవ్వుతో కేరింత గొట్టు నిన్ను
గాంచి ప్రకృతి యెంత పరవశించినదియొ !!

అపుడు ధర్మ రక్షణకుగా నవతరించి
దత్తమైనావు నీ వత్రి దంపతులకు;
నవ సమాజ నిర్మాణమ్ము నవధరించి
!

- పుత్రరత్నముగ కన్గో నెంచి ఆ శ్రీయుతుల్
వరలక్ష్మమ్మయు నాంజనేయులును సంభావింప తొల్ బామునన్
కర మద్దిన్ తప మెంత సల్పిరొ ? జగత్కల్యాణకాంక్షన్ వసుం
ధరపై క్రమ్మర నుద్భవించితివి - దత్తాత్రేయ దివ్యాంశతో !

ఆదిని శ్రీపీఠాపురమునందు జనించి యశమ్ము గొన్న శ్రీ
పాదులుగా - పదంపడి భవాల నృసింహ సరస్వతీ యతీం
ద్రాదులుగా - అనేక అవతారము లెత్తిన దత్తమూర్తి వీ
వౌదని తేలిపోయె; ఇక అపుము! దాగుడుమూత లో ప్రభూ !!

ఎందరు లేరు యోగులు, మునీశ్వరు లీ జగమందు ? వా
రందరు ముక్కు మూసికొని, ఆ పరమాత్మను స్వార్థబుద్ధితో
పొందగ - సర్వమున్ వదలి పోవగ - నెంతురెగాని, నీవలెన్
పొందిన శక్తి యుక్తులను భూతహితమ్ముగ పెచ్చ నెంతురే ??

ప్రియమున్ శ్రేయము గల్గ నిచ్చితివి "ఓం శ్రీసాయిరాం" మంత్రమున్
దయ తోడన్ "గురు దేవదత్త" ననుసంధానించి భక్తాళికిన్;
నియమం బూని జపించు వారలకు శాన్తించెన్ మనక్షోభముల్;
భయముల్ వీడెను; నీవు కల్గ గురుదేవా! లోటు వాటిల్లునే ?

"దేహమే పరికింప దేవాలయ" మ్మను
వేదవాణిని వినిపించినావు;
"దయగల హృదయమే దైవపీఠ" మ టన్న
భక్తి సూత్రము పట్టు బట్టినావు;
"జగతి నంతట నిండు శక్తియే వ్యక్తిలో
నిలుపెల్ల కల" దని తెలిపినావు;
"అడుపు - పొదుపు" రెంటి అవసరాలను చాటి
గృహ సంస్కరణము కాంక్షించినావు;

"జగము బ్రహ్మము" రెండును సత్య మనుచు,
"భౌతికమ్మును కాదన వల" దటంచు,
మనిషిని "మనీషి"గా దిద్దు మహిత కార్య
దీక్ష గొన్నావు – శ్రీ గురుదేవ ! - నీవు !!

బ్రహ్మ విష్ణు శివస్వరూపంబు నీవు !
పరమ నిర్గుణ శుద్ధ తత్త్వంబు నీవు !
సర్వ జగముల నేలు చిచ్ఛక్తి వీవు !
"విశ్వదత్త"వు నీవు ! మా వెలుగు నీవు !!

జపములు, తపములు సలుప నక్కరలేదు
        నిన్నెడంద తలంచుకొన్న చాలు-
పుణ్యతీర్థాలలో మునుగ నక్కరలేదు
        నీ పదాంబుజము లంటినను చాలు -
శాస్త్రమ్ము లేవియు చదువ నక్కరలేదు
        నీ శుభాశీస్సు లందినను చాలు -
వెలుపు తరువును వేడ నక్కర లేదు
        నీ మోవి నొలుకు వెన్నెలలు చాలు -

అలయ నక్కరలేదు భయమ్ము నొరసి
గురువరా ! నీవు మము కనుగొన్న చాలు -
నీదు సన్నిధే మాకు పెన్నిధి గదయ్య !
అందుకోవయ్య ! హృదయ పుష్పాంజలులను !!

— విద్యాసాగరశర్మ.



శ్రీనోరి రాజగోపాలశాస్త్రి

వారి ... శ్రీమతి మిరియాంబ కుమారుడు చి. వెంకటరమణ

# ము ం దు మా ట

ఇప్పటికి పదిహేను సంవత్సరాలక్రితం నేను వరంగల్లో పనిచేస్తున్నప్పుడు, ఆప్తమిత్రుడు చిరంజీవి శ్రీమల్లాది సుదర్శనశర్మ సప్తశతి గ్రంథానికి తాను వ్రాసిన వ్యాఖ్యానసహితమైన సుదీర్ఘ వ్యాసమొకటి పోస్టులో పంపిస్తూ, దాన్ని చదివి సరిజేయమని అభ్యర్థించాడు. ఏదో సప్తశతిని చదివానేగాని విమర్శనా దృష్టితో అప్పటివరకూ దాన్ని చదువలేదు. శ్రీసుదర్శనశర్మ వ్రాసినవ్యాసంలో కొన్ని ముఖ్యవిషయాలు వేరే పుస్తకంలో వ్రాసి పెట్టుకొని, లైబ్రరీకి పోయి సప్తశతి వ్యాఖ్యాన గ్రంథాలు పరిశీలిస్తూ, కొన్ని పాయింట్స్ నోటుచేసుకొంటూ ఉండేవాణ్ణి. అట్లా చదువుతుంటే కొన్ని రహస్యాలు అవగతం కావటం మొదలుపెట్టాయి. ఆ తర్వాత కొద్ది రోజుల్లో నాకు ట్రాన్స్ఫర్ రావటం, వేరేచోటికి మారటం జరిగింది. ఈ బదిలీలో మా సుదర్శనశర్మ పంపించిన పుస్తకం ఎక్కడో పడిపోయింది. కనిపించలేదు. సుదర్శనశర్మ ఒకటి రెండుసార్లు హైదరాబాదులో కలిసినా ఆ పుస్తకం సంగతి నాదగ్గర ఎత్తేవాడు కాదు. నేను ఆ పుస్తకం పోయినసంగతి అతనితో చెప్పేవాణ్ణికాదు. చాలా సంవత్సరాలు ఇట్లా గడచిపోయాయి. నేను రిటైరై ఇంటికి వచ్చాను.

ఇటీవల ఒకసారి పూజ్యశ్రీ విఠల్ బాబాగారు (విజయవాడ) తమ "శ్రీగురుచరణము" మాస పత్రికకు వ్యాసాలేమైనా ఉంటే పంపించమని అడిగితే-లోగడ నేను సేకరించి పెట్టుకొన్న ముఖ్య విషయాలకు మరికొన్ని జోడించి, "సప్తశతి-ఒకపరిశీలన" అనే

పేరుతో ఒక సుదీర్ఘవ్యాసం వ్రాసి పంపించాను. ఆ వ్యాసం నాల్గు నెలలు ధారావాహికంగా ఆ పత్రికలో ప్రచురించబడింది. చాలా మంది బాగున్నదని దాన్ని మెచ్చుకున్నారుగూడా. ఇప్పుడావ్యాసం మరికొన్ని సవరణలతో, కొన్ని ముఖ్య స్తోత్రాలతో, అప్పుడెప్పుడో నేను జడ్చర్లలో ఉన్నప్పుడు (1965) శ్రీభాస్కరానంద సరస్వతీ స్వామివారి ద్వారా ఉపదేశంపొందిన విలక్షణమైన, గుహ్యాతి గుహ్యమైన మంత్రాన్ని, ''కుండలినీయోగరహస్యం'' అనే పేర రూపొందించిన వ్యాసం అనుబంధంగాచేసి, పుస్తకరూపంగా ఇట్లా వెలువరించటం జరిగింది.

ఈ గ్రంథంలోని విషయాలేవీ నా స్వంతంగావు. నాకు తెలిసిన విశేషాంశాలను లోకానికి తెలియచేయాలన్న ఉత్సాహంతో, ఈ గ్రంథరూపంగా ఇట్లా ప్రకటించటం జరిగింది. ఏవైనా ఇందులో ప్రత్యేకించి ప్రశంసింపదగిన అంశాలుంటే-అవి ప్రకటించినగౌరవం మాసుదర్శనశర్మకూ, శ్రీభాస్కరానంద సరస్వతీస్వామివారికీ దక్కుతుందని విన్నవిస్తున్నాను. వాళ్ళు వెల్లడించిన విషయాలు అక్షరబద్ధంచేసి, వివరణాత్మకంగా లోకానికి వెల్లడించటమే నేను చేసిన పని. అమూల్యమైన, అతిరహస్యమైన, అపూర్వమైన విషయాలు మరుగునపడిఉంటే ప్రయోజనం ఉండదనీ, లోకానికి తెలిస్తే-లోకహితం జరుగుతుందనీ బావించి ఇట్లా చేశానని సవినయంగా మనవి కేస్తున్నాను.

ఈ గ్రంథాన్ని అమెరికాలో స్థిరనివాసంచేసుకొని ఉంటున్న మా చి॥ నోరి రాజగోపాలశాస్త్రి ముద్రణాభారాన్నివహించి, ప్రకటించి లోకానికి అందిస్తున్నాడు. లోగడ నేను వ్రాసిన ''శ్రీవిశ్వ

గురుచరిత్ర", "శ్రీవాసుదేవానందస్వామివారి జీవితచరిత్ర"నే గాక, పూలమ్మగా ప్రసిద్ధికెక్కిన శ్రీమతి చుండూరు కామేశ్వరమ్మగారి జీవిత చరిత్రనుగూడా అచ్చువేయించిన సహృదయుడు ఆయన! ఆయన తల్లిగారైన శ్రీమతి వెంకటశేషమ్మ, చమళ్ళమూడి గ్రామ మునసబుగారుగా ప్రసిద్ధిచెందిన మారాచకొండవెంకటవీరరాఘవయ్య మామయ్యగారి పెద్దకూతురు. మా తమ్ముడు చి॥ విశ్వనాథశాస్త్రి, (ఇప్పటి శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ సద్గురు మహరాజ్) పారాడే పసిపిల్లవాడై ఉన్నప్పుడు ఎత్తుకొని, లాలించి, వాత్సల్యం వర్షించిన ప్రేమమూర్తి. ఆ మాతృమూర్తి తనయుడైన చి॥ రాజగోపాల్ తల్లిగారినుండి ప్రేమ వాత్సల్యాలు పుణికిపుచ్చుకొని, పరదేశంలో ఉన్నా స్వధర్మం మరువని సంస్కారవంతుడుకావటం ఒక విశేషం.

గత సంవత్సరం శ్రీవిశ్వయోగివిశ్వంజీ 49వ జన్మదినోత్సవం నాడు నేను వ్రాసిన రెండు పుస్తకాలను ఆయన శ్రీవిశ్వయోగికి సమర్పించాడు. ఇప్పుడు ఈ 50వ జన్మదినోత్సవంలో ఈ గ్రంథాన్ని సమర్పించబోతున్నాడు. ఇది ఆ స్వామిపై ఆయనకున్న ఆరాధనాభావానికి పరమనిదర్శనం. ఇంతటి భక్తి శ్రద్ధలు కలవాడు కావటంవల్లనే చి॥ రాజగోపాల్ శ్రీవిశ్వయోగి అనుగ్రహానికి ఇంతగా పాత్రుడుకావటం సంభవించింది. ఇది నా కత్యంతం ప్రహర్షణీయమైన విషయం.

ఈ గ్రంథం ఒక్క శాక్తేయులకే గాక ఆస్తికు లందరికీ అభిమానపాత్రమై, సమాదరణీయం కాగలదని ఆశిస్తున్నాను. అస్తు!

గుంటూరు
5—3—94

శ్రీ సాయిదత్త పదపద్మరజోలేశం
విద్యాసాగరశర్మ

# ధన్యోస్మి

పూలమ్మగా ప్రసిద్ధికెక్కిన శ్రీమతి చుండూరు కామేశ్వరమ్మగారి అనుగ్రహ విశేషంవల్ల దత్తాంశ సంభూతులైన శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీగారి పరిచయము నాకు లభించినది. పూర్వాశ్రమములో ఆయనగారిది మా మాతామహుల గ్రామమైన చమళ్ళమూడి అనీ, ఆయన చిన్నతనాన మా అమ్మగారు ఆయన్ను ఎత్తుకొని లాలించెడి దనీ తెలిసిన తరువాత పరమానందము కలిగినది. క్రమక్రమముగా ఆయన సామర్థ్యమునెరిగి ఆత్మార్పణ కావించుకొంటిని. ఆ తరువాత శ్రీవిద్యాసాగరశర్మగారితో పరిచయము లభించినది. శ్రీశర్మగారు, వారి కుటుంబము నాపై చూపించు ప్రేమ, వారికి నన్ను మరింత సన్నిహితుణ్ణి చేసింది.

నా పూర్వజన్మ సుకృతంవల్ల శ్రీవిద్యాసాగరశర్మగారు రచించిన "శ్రీవిశ్వగురుచరిత్ర" "శ్రీవాసుదేవానందస్వామివారి జీవిత చరిత్ర" అచ్చువేయించెడి మహాభాగ్యము కలిగినది. ఇదంతయు దత్తస్వరూపులైన శ్రీ విశ్వయోగి విశ్వంజీవారు నాపై చూపించెడి అనుగ్రహఫలిత మని భావిస్తున్నాను.

శ్రీవిశ్వయోగి విశ్వంజీగారి 50వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని "సప్తశతీరహస్యాలు" చిచ్ఛక్తిస్వరూపులైన ఆ స్వామి వారికి సమర్పించుకొను సదవకాశము నాకు లభించినది. నా జన్మ ధన్యమైనది. ఇట్లే సదా ఆ దత్తమూర్తి నన్నూ, నా కుటుంబాన్నీ కంటికిరెప్పలా కనిపెట్టి చూచుచుండవలసినదిగా హృదయపూర్వకముగా ప్రార్థిస్తున్నాను.

ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త

అమెరికా
25—2—94

— నోరి రాజగోపాలశాస్త్రి

ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

హ్రీం నమశ్చండికాయై

# సప్తశతీ రహస్యాలు

**ఉపక్రమణిక :**

'సప్తశతి' శాక్తేయులకు మిగుల ప్రీతి పాత్రమైన పవిత్ర పారాయణ గ్రంథం. దానికి "చండీ విద్య" అని కూడా లోకంలో వ్యవహారముంది. చతుర్విధ పురుషార్థ సాధనలో దానికి మించిన విద్య మరొకటి లేదు. శక్తియొక్క అనుగ్రహాన్ని సంపాదించడానికై వెలసిన అనేకానేక పారాయణ గ్రంథాలలోనికెల్లా ఇది మకుటాయమానమైంది. సమస్త తంత్ర గ్రంథాలలోని విషయాల కన్నిటికీ అదే ఆధారభూతం. భగవతీ సాక్షాత్కారాన్ని మనం ఎలా పొందాలో అందులో వివరంగా వర్ణించబడింది. ఆ మార్గం మిక్కిలి దుర్గమం కావడం వల్ల దానికి "దుర్గా సప్తశతి" అనే మరో పేరు కలిగింది. ఇంకా దానిని "సప్తశతి", "దేవీ మాహాత్మ్యం" అనే పేర్లతో కూడా పిలుస్తున్నారు.

సర్వ ప్రపంచానికి మూలభూతమైన పదార్థాలు రెండు ఉన్నవి. ఒకటి బ్రహ్మము. రెండు మాయ. మిగిలినదంతా వాటి వికారమే. సృష్టి స్థితిలయాలకు ఆధారభూతమైన ఒక మహత్తర వస్తువు ఉన్నదనీ, అదే బ్రహ్మమనీ వేదాలు చెబుతున్నాయి. ఆ వస్తువును గూర్చి ఉపనిషత్తులు కూడా "సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ" అని నిర్వచించాయి. యథార్థానికి సత్, చిత్, ఆనందములే బ్రహ్మస్వరూపం. ఆ పదార్థాల నుంచే సర్వ ప్రపంచ మూలకారణమైన మాయ ఆవిర్భవించింది. బ్రహ్మ-మాయ అనేవి రెండు పదార్థాలుగా పైకి మనకు కనిపిస్తున్నప్పటికీ అవి వేరుగావు.

చంద్రుడు-చంద్రిక,అగ్ని-దహనశక్తి, సూర్యుడు-ప్రకాశము-మొదలయి వాటి మాదిరిగా ఆ రెండింటిని మనం వేరు చెయ్యలేము. బ్రహ్మకం మాయ వేరుగాదు. ఆ రెండు ఒక్కటే.

బ్రహ్మము సత్యమైంది. అవ్యక్తమైంది. లింగాతీతమైంది. "న నషండో నపుమాన్ నజంతుః" అని అది వర్ణించబడింది. కానీ బ్రహ మూడు లింగాల్లో చెప్పబడటము జరిగింది. "రసోవైసః సబ్రహ్మ" అ పుంలింగములోనూ, "తత్త్వమసి" అని నపుంసక లింగంలోనూ, "దే అక్షరం బ్రహ్మ సమ్మితం" అని స్త్రీ లింగంలోనూ బ్రహ్మను వర్ణించారు అందువల్లనే కొందరు ఆ తత్త్వాన్ని పురుషుడుగా, మరి కొందరు స్త్రీగా ఇంకా కొందరు సచ్చిదానందముగా భావించి ఉపాసిస్తున్నారు.

మూలతత్త్వాన్ని స్త్రీ మూర్తిగా భావించి చేసే ఉపాసనే శ్రీ విద్య ఈ శ్రీ విద్యా ప్రదాత గురుదేవులు శ్రీ దత్తాత్రేయుల వారు. ఆయన మొదట ఈ విద్యను పరశురామునికి బోధించగా, పరశురాముడు కష్టే అరణ్యంలోనున్న హరితాయన మహర్షికి ఈ విద్యను ప్రసాదించాడు ఆ హరితాయన మహర్షి ఈ శ్రీ విద్యను లోకానికి వెల్లడించాడు. ఈ హరితాయనుడికే "సుమేధ" యని మరో పేరున్నదని త్రిపురా రహస్యం వెల్లడిస్తున్నది.

ఈ శ్రీ విద్య లలిత పర్యాయం, చండీ పర్యాయం అని రెండు రకాలుగా ఉంది. బ్రహ్మాండ పురాణం, దేవీభాగవతం లలితా మహిమను ప్రతిపాదిస్తే, మార్కండేయ పురాణం చండీ మహిమను ప్రకటించింది.

ఈ రెండు తత్త్వాలకు శబ్ద భేదమే కాని వస్తు భేదంలేదు. మొద టిది పంచదశాక్షర ఘటిత మంత్రప్రతిపాదితమైతే, రెండోది నవాక్షర ఘటిత మంత్ర ప్రతిపాదితమైంది.

ఆదిశక్తి యొక్క శాంతాకారాన్ని "లలిత" అని, రౌద్రాకారాన్ని ండిక" అని శాక్తేయులు వ్యవహరిస్తారు. "మూలాధారే కామరూపే లంతీ చండికా శిఖా" అని ఈ మహాశక్తి మూలాధారంలో ప్రజ్వలిస్తూ ంటుంది. సాధకుడు దానిని మేల్కొల్పవలసి ఉంటుంది.

సప్తశతి చండీ మహిమను ప్రకటిస్తున్నది. చండినే 'చండిక' అని ంటా పిలుస్తారు. ఈ శక్తే ఋగ్వేదంలో కాళి, తార, మొదలయిన ర్లతో నుతించబడింది. "మాయ" అనేది దీని నామాంతరం. కాళి, ాళి, దుర్గ, అన్నపూర్ణ, హైమవతి, ఉమ, అంబ, అంబాలికా అనే ర్లు దేవీ ఉపనిషత్తు, త్రిపురా ఉపనిషత్తు, దక్షిణామూర్తి ఉపనిషత్తులలో ిపిస్తున్నవి.

## ప్తశతికి గల పేర్లు :

ఈ సప్తశతికి దేవీ మహాత్మ్యం, చండీ సప్తశతి, దుర్గా సప్తశతి నే పేర్లున్నాయి. ఈ సప్తశతి స్తోత్రము "మార్కండేయ ఉవాచ" దగ్గర ంచి "సావర్ణి ర్భవితా మను" అనేదాకా ఉన్న పదమూడు అధ్యాయాల ాపంగా మార్కండేయ పురాణంలో ఉంది. ఘోరాపద చెంది, దేవతలు ోత్రం చేస్తే, దేవకార్య సముద్యక్తయై, రాక్షససంహార నిమిత్తం త్రిపురా వి కాళికా రూపం ధరించింది. కాలాంతరంలో ఆమె కాళీ, లక్ష్మి, సర ్వతీ మూర్తులుగా రూపొందింది. ఈ చరిత్ర యావత్తూ మార్కండేయ ురాణంలోని ఆ పదమూడు అధ్యాయాల్లోనూ ఉంది. ఆ చరిత్రకే "సప్తశతి" ని పేరు. ఈ చరిత్రను పఠిస్తే, సర్వాభీష్టాలు సిద్ధించి, సర్వోపద్రవాలు శిస్త"వని చిదంబర సంహిత దాని ప్రాశస్త్యాన్ని ఉద్ఘోషిస్తున్నది.

సప్తశతిలో మూడు చరిత్రలున్నవి. మొదటి చరిత్రలో మోహన' ారణ మొదలైన ప్రయోగాలు 90, మధ్యమ చరిత్రలో ఉచ్చాటనం,

స్తంభనం మొదలైన ప్రయోగాలు 200, ఉత్తమ చరిత్రలో విద్వేషణం, వశ్యం మొదలైన ప్రయోగాలు 410, మొత్తం 700 ప్రయోగాలు ఇందులో వున్నవి. కాబట్టి దీనికి సప్తశతి అని పేరు. 700 మంత్ర గర్భిత శ్లోకములతో కూడింది కాబట్టి దీనికి సప్తశతి అని పేరు వచ్చింది.

## సప్తశతియా? సప్తసతియా ?

ఏడు కల్పాలలోని మహావిద్య మొదలైన సప్తసతులు బ్రహ్మ, ఇంద్రుడు, బృహస్పతి, శుక్రుడు, విష్ణువు, రుద్రుడు, సురద్విషుడు (అంధ కాసురుడు) అనే ఏడుగురికి ఉపాస్య దేవతై, బ్రహ్మచే స్తుతించబడటం వల్ల దీనికి "సప్తశతి" అని పేరు వచ్చింది.

ప్రథమ చరిత్రమున 1. కాళి 2. తార 3. ఛిన్నమస్తక 4. సుముఖి 5. భువనేశ్వరి 6. బాల 7. కుబ్జ అనే సతులు ఏడుగురున్నారు. మధ్యమ చరిత్రమున 1. లక్ష్మి 2. లలిత 3. కాళి 4. దుర్గ 5. గాయత్రి 6. అరుంధతి 7. సరస్వతి అనే ఏడుగురున్నారు. ఉత్తమచరిత్రమున 1. బ్రాహ్మి 2. మహేశ్వరి 3. వైష్ణవి 4. వారాహి 5. నారసింహి 6. ఐంద్రి 7. చాముండ అనే సతులు ఏడుగురున్నారు. ఇంతేగాకుండా సతుల సమిష్టి రూపాలయిన 1. నంద 2. శతాక్షి 3. శాకంభరి 4. భీమ 5. రక్తదంతిక 6. దుర్గ 7. భ్రామరి అనే సప్తసతులు ఇందులో ప్రధానంగా ఉన్నారు. కనుక దీనికి "సప్తసతి" అనే పేరు వచ్చింది.

## దేవీ మాహాత్మ్యం :

'మహాత్మ' అంటే గొప్ప ఆత్మ. అటువంటి దాని శక్తి ఏదైతే ఉన్నదో అది మాహాత్మ్యం. 'మహాత్మ' అనేది ఆదిశక్తి. అది తన ప్రభావం వల్ల అనేక శక్తులుగా మారింది. ఆ శక్తులు తమ కర్తవ్యాన్ని

నిర్వహించిన తర్వాత తిరిగి తమ జనకాత్మలో లీనమౌతవి. సప్తశతిలో మాతృకాశక్తియైన చండీ మహిమవల్ల ఉద్భవించిన శక్తుల మహిమ వర్ణించబడింది. కాబట్టి దానికి 'దేవీ మాహాత్మ్యం' అనే పేరు వచ్చింది.

ప్రథమ చరిత్రలో మహాకాళీ రూపిణియైన యోగమాయాదేవియొక్క మాహాత్మ్యం, మధ్యచరిత్రలో మహాలక్ష్మీ రూపిణియైన సర్వదేవ శరీరజ యైన మహిషాసురమర్దని యొక్క మాహాత్మ్యం, ఉత్తమచరిత్రలో మహా సరస్వతీ రూపిణియైన కౌశికీ దేవి యొక్క మాహాత్మ్యం వర్ణించబడింది. ఇంతేగాక మాతృకా దేవతల మహిమ కూడా వర్ణించబడింది. కాబట్టి దీనికి దేవీ మాహాత్మ్యం అనే పేరు వచ్చింది.

ఈ గ్రంథానికి ఉన్న పేరులన్నీ పరిశీలించి చూస్తే 'సప్తశతి' అనే పేరు సమంజసంగా ఉన్నట్లు కన్పించటం లేదు. ఇప్పుడు మనకు దొరుకు చున్న సప్తశతిలో 700 శ్లోకములు లేవు. ఉవాచలు, అర్ధశ్లోకములు, పూరణ శ్లోకములు, కలిపి మొత్తం 700 శ్లోకములుగా కొంతమంది చూపిస్తు న్నారుగాని, దొరుకుతున్న ప్రతులలో ఒకదానికి ఒకటి పొంతన కుదరటం లేదు. అల్లే "సప్తసతి" అనే పేరు కూడా ఎక్కడా ఎవరిచే పేర్కొన బడలేదు. గ్రంథంలో మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులకు మూల శక్తియైన చండికాదేవి యొక్క మహిమ వర్ణించబడింది. కాబట్టి అన్ని విధాల 'దేవీ మహాత్మ్యం' అనే పేరు దానికి తగి ఉన్నట్లు కనిపిస్తున్నది. వేరు వేరు గ్రంథాల్లో ఇది సప్తశతిగా ఉదాహరించబడి క్రమంగా దానికి ఆ పేరే స్థిరపడింది. కనుక సప్తశతి అన్నప్పటికీ వచ్చిన ప్రమాదమేమీ లేదు. చండీ మహిమను అది వర్ణిస్తున్నది. కాబట్టి దానిని "ఛండీ సప్త శతీ" అని కూడా వ్యవహరిస్తున్నారు.

## చండిక ఎవరు ?

'చండిక' అంటే పరబ్రహ్మ పట్టమహిషి అయిన దేవత. 'చడీ-కోపే' అనే ధాతువు నుంచి 'చండిక' అనే పదం నిష్పన్నమైంది. మహా భయ జనకమగు క్రోధమే 'చడీ' అను ధాతువు అర్థం. అటువంటి కోపమే పరబ్రహ్మ. అదే మాయ. బ్రహ్మవేరు మాయ వేరుకాదు. రెండూ ఒక్కటే! జ్ఞాత, ఇచ్ఛా, క్రియా సమష్ఠ్యాత్మకమే బ్రహ్మ ధర్మము. అదే మాయ. ఆ ధర్మము, ధర్మి ఐన బ్రహ్మతో అభిన్నము. ఆ ధర్మమునకే "శక్తి" అని పేరు. ఆ శక్తే చండిక. శుద్ధ బ్రహ్మ భిన్నములైన, ధర్మ రూపములగు జ్ఞాన, ఇచ్ఛ క్రియలకు సృష్టి రూపాలే మహాకాళీ, మహా లక్ష్మి, మహాసరస్వతులు. ఆ దేవతాత్రయ సమిష్టిరూపమైన ధర్మమే చండిక.

## సప్తశతిలో మూడు చరిత్రము లెందుకున్నవి ?

"సప్తశతి"లో మూడు చరిత్రలే ఎందుకున్నవి? ఒకటి తక్కువ గానో లేక ఒకటి ఎక్కువగానో ఉండవచ్చుగదా?" అనే ప్రశ్నకు సమా ధానంగా "యుద్ధంలో దేవతలు రాక్షసులచే మూడుసార్లు ఓడిపోయారు. వారిని రక్షించడానికై దేవి మూడుసార్లు వేరు వేరు రూపాలతో అవతరిం చింది. కాబట్టి మూడు చరిత్రలు చెప్పబడ్డ"వని కొందరు చెబుతారు. కాని ఇది వాస్తవంకాదు. పూర్వకాలంలో రాక్షసులతో దేవతలకు ఎన్నో పర్యా యాలు యుద్ధం జరిగినట్లుండగా మూడు పర్యాయాలే యుద్ధము జరిగిందని చెప్పటంలో ఔచిత్యం లేదు. సప్తశతిని మూడు చరిత్రలుగా చెప్పటంలో ఒక ఆధ్యాత్మిక రహస్యముంది. ఆధ్యాత్మికమంటే ఆత్మకు సంబంధిం చింది. ఆత్మ-అనగా జీవాత్మ. జీవాత్మ అంటే అధిష్ఠాన చైతన్యం. లింగ శరీరం పంచకర్మేంద్రియాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచప్రాణాలు,

అంతఃకరణ చతుష్టయంతో కూడినటువంటిది. అది చిదాభాసల సమాహారం. జీవుడికీ, అధిష్ఠాన చైతన్యానికీ (ఆత్మకూ) తాదాత్మ్య సంబంధం ఉంది. సత్త్వరజస్తమో గుణాలనుబట్టి లింగశరీరం మూడు విధాలుగా ఉంటుంది. వీటినే కర్మజతాదాత్మ్యము, సహజ తాదాత్మ్యము. భ్రమజ తాదాత్మ్యము అని అంటారు. తాదాత్మ్యమంటే "ఒకదానితో నొకటి ముడి వడినది" అని అర్థం.

1. స్థూల సూక్ష్మతాదాత్మ్యము - కర్మజము

2. అంతఃకరణ చిదాభాసలతాదాత్మ్యము-సహజము

3. చిదాభాస అధిష్ఠానచైతన్యతాదాత్మ్యము-భ్రమజము.ఇవే మూడు గ్రంథులు.

ఈ విషయాన్నే మనం మరొక విధంగా చెప్పవచ్చు. ప్రాణికోటిలో మూడురకాలైన కర్మలకు సంబంధించి, మూడు రకాలైన సంస్కారాలు ఉంటాయి. మానవుడి జనన మరణాలకు బీజరూపమైన అతని కర్మయే కారణం. కర్మబీజములు 1) సంచితం 2) ఆగామి 3) ప్రారబ్ధం అని మూడు విధాలు.

విత్తనాలను ఎచ్చటెచ్చటనుంచో కొనివచ్చి ఒకచోట రాశిపోయటం సంచిత(కూడబెట్టటం)ఎట్లాఅవుతుందో, అట్లే జన్మాంతర కారభూతములైన కర్మల సముదాయమే "సంచిత" మనబడుతుంది. ధాన్యరాశి నుండి కొంత ధాన్యముతీసి పంటకుపయోగించినట్లు, కర్మరాశి నుండి కొంత కర్మఫలము తీసి జన్మాది ఫలితము లారంభించినవైన ఆ కర్మ బీజములను "ప్రారబ్ధ కర్మబీజము" లంటారు. దాని ఫలితంగానే మనకు మన ప్రస్తుత శరీరం ఏర్పడుతుంది.

పండిన పంట నుండి కొంత ధాన్యము రాబోవు పంటకు కారణమై నట్లుగానే, ఈ జన్మలో చేసిన కర్మలు సంచితాలై, రాబోయే జన్మలకు కారణమౌతాయి. అటువంటి కర్మబీజాలను "ఆగాము" లంటారు.

జీవుల్లో కర్మబీజ సంస్కారములకు ఆధారమైంది అంతఃకరణం. ఈ అంతఃకరణంలో 1) చిత్తవృత్తి 2) బుద్ధివృత్తి 3) మనోవృత్తి 4) అహంకారవృత్తి అనే నాల్గు వృత్తులుంటాయి.

అంతఃకరణంలో మూడు దోషాలున్నాయి. అవి : 1) మలదోషం 2) విక్షేపదోషం 3) ఆవరణదోషం. జన్మజన్మాంతర వాసనకు "మల" మని పేరు. మానసిక చంచలతనే 'విక్షేప'మంటారు. స్వస్వరూపాజ్ఞాన మునే (తానెవరో తాను తెలుసుకోలేకుంటయే) "ఆవరణ" మంటారు. ఈ మూడు దోషములే మూడు గ్రంథులు. ఇవే మానవుణ్ణి సంసార చక్రానికి గట్టిగా బంధించివేస్తున్నవి. ఈ గ్రంథి భేదనం జరిగితేనేగాని మానవుడు సంసార చక్రంనుంచి బయటపడడు. ఈ మూడు గ్రంథులకే బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి అని పేర్లున్నవి, ఆగమతంత్ర శాస్త్రాల్లో వీటికే మూలాధారగ్రంథి, హృదయగ్రంథి, జిహ్వా(తాలు) గ్రంథులని పేర్లున్నవి.

## గ్రంథిత్రయ వివరణ :

1) బ్రహ్మగ్రంథి : స్థూల సూక్ష్మ శరీరాల తాదాత్మ్యం-స్థూల శరీరాభిమానం- (మూలాధారగ్రంథి)

జన్మజన్మాంతర వాసన (మలము) నశిస్తే ఈ గ్రంథి భేదనం జరుగుతుంది.

2) విష్ణుగ్రంథి : అంతఃకరణ చిదాభాసల తాదాత్మ్యం-సూక్ష్మ శరీరాభిమానం (హృదయగ్రంథి)

మానసిక చాంచల్యం (విక్షేపం) నశిస్తే ఈ గ్రంథిభేదనము జరుగుతుంది.

3) రుద్రగ్రంథి : చిదాభాస అధిష్ఠాన చైతన్యాల తాదాత్మ్యం-కారణశరీరాభిమానం జిహ్వా(తాలు) గ్రంథి.

స్వస్వరూపాజ్ఞానం (ఆవరణం) నశిస్తే ఈ గ్రంథి భేదనం జరుగుతుంది.

అంటే-కుండలినీ శక్తి మూలాధార స్వాధిష్ఠానములను దాటితే బ్రహ్మగ్రంథి భేదనం, మణిపూర అనాహత చక్రాలను దాటితే విష్ణుగ్రంథి భేదనం, విశుద్ధ ఆజ్ఞా చక్రాలను దాటితే రుద్రగ్రంథి భేదనం జరుగుతాయని యోగశాస్త్ర పిండితార్థం.

**మూడు చరిత్రములలో – మూడు గ్రంథుల సంబంధము :**

సచ్చిదానందమే బ్రహ్మ స్వరూపంగా పేర్కొనబడింది. సత్, చిత్, ఆనందము- అనే మూడు పదాల్లో వేరువేరుగా మూడు ప్రభావములున్నవి. కనుకనే సప్తశతిలో ప్రథమ చరిత్రమున సత్ (సత్తా) యొక్క ఉపాసన, మధ్యమ చరిత్రమున చిత్ (చైతన్యము) యొక్క ఉపాసన, ఉత్తమ చరిత్రమున ఆనందోపాసన విహితములైనవి. వీనివలన వరుసగా గ్రంథిత్రయ భేదనం జరుగుతుంది.

మూలాధారంలో కుండలినీ శక్తి పాములాగా మూడున్నర చుట్టలు చుట్టుకొని పరుండి ఉంటుంది. సాధకుడు తన ఉపాసనచే దానిని లేపిన బ్రహ్మగ్రంథి భేదనం, హృదయమున చేర్చిన విష్ణుగ్రంథి భేదనం, ఆజ్ఞా

చక్రమున చేర్చిన రుద్రగ్రంథి భేదనం జరుగుతుంది. ప్రథమ చరిత్రమున గల మధుకైటభ సంహారమే బ్రహ్మగ్రంథి భేదనం. మధ్యమ చారిత్ర మున గల మహిషాసుర మర్దనమే విష్ణుగ్రంథి భేదనం. ఉత్తమ చారిత్ర మునగల శుంభ నిశుంభుల వధే రుద్రగ్రంథి భేదనం. ఇట్లా మూడు గ్రంథుల భేదనం జరిగి సాధకుడు జీవన్ముక్తుడు కావడానికీ, సచ్చిదానంద స్వరూపంగా మారడానికీ ఆ మూడు చరిత్రలూ సప్తశతిలో నిబంధించ బడ్డాయి.

## సప్తశతి - ఆధ్యాత్మిక రహస్యం :

శక్తి పరిణామ రూపమైన స్థూల, సూక్ష్మ, కారణశరీరాలపై ఉన్న అభిమానంతో దుఃఖపడే జీవుడు తన పురాకృత పుణ్యవిశేషంవల్ల చండీ తత్త్వ పరిజ్ఞానంతో, ప్రాణవాయువును నిరోధించే అభ్యాసం గలవాడై, మూలాధార చక్రంలో నిద్రిస్తున్న కుండలినీ శక్తిని జాగృతం చేస్తాడు. అప్పుడు కుండలినీ శక్తి సుషుమ్నా నాడీమార్గంలో ఊర్ధ్వముఖంగా పయ నిస్తుంది. మూలాధారాది షట్చక్రాలనూ, బ్రహ్మ విష్ణు రుద్రగ్రంథులనూ ఛేదించుకొని సహస్రారమనే స్వస్థానాన్ని చేరుకొంటుంది. ప్రాణవాయు వును నిరోధించే అభ్యాసం లేకపోయినప్పటికీ చండీ అనుగ్రహం లభించి నట్లైతే సాధకుడు ఆత్మవిచారంచేత గూడా ఈ శరీర త్రయాభిమానాన్ని నాశనం చేసుకొనేటందుకు వీలుంది. కుండలినీశక్తి సహస్రారాన్ని చేరు కోవటంతో జీవుడు స్వస్వరూప జ్ఞానం గలవాడై ఉండటంచేత స్వాత్మా నందంలో నిత్యం ఓలలాడుతుంటాడు.

సప్తశతిలోని పదాలకున్న అర్థాలే వేరు. ప్రథమచరిత్రలో సావర్ణి స్వారోచి, చైత్ర వంశం మొదలైన పదాలున్నవి. 'సావర్ణి' - అంటే సూర్యశక్తి. "స్వారోచిషు" డంటే స్వర్గసంబంధమైన జ్యోతి. "చైత్ర

వంశ సముద్భవ"మంటే అనేక చిత్ర విచిత్రములైన జన్మలను పొంది-అనగా అండజ, పిండజ, స్వేదజ, ఉద్భిజ జన్మలను పొంది-చిట్టచివరకు దుర్లభమైన మానవ శరీరాన్ని పొందటమని అర్థం. "క్షితిమండల"మంటే శరీరం. "సురథు"ఉంటే జీవుడు.

సప్తశతిలో "సురథు"డనే క్షత్రియుడు తృతీయ పురుషార్థమైన కామానికీ, "సమాధి" అనే వైశ్యుడు చతుర్థ పురుషార్థమైన మోక్షానికి ప్రతీకలు. సురథుడు తన రాజ్యాన్నీ సమాధి తన ధనాన్ని కోల్పోయి, సమేధసుడనే (ఈయనకు సుమేధ అనే మరో పేరుంది. ఈయనే పరశు రాముడి దగ్గర్నుంచి శ్రీవిద్యను పొంది లోకానికి ప్రసాదించిన హారితాయన మహర్షి) ముని ఆశ్రమానికి వస్తారు చివరికి గురూపదేశంతో అనుగ్రహాన్ని పొంది ఇష్టకామ్యార్థ సిద్ధినందుతారు. ఈ కథలో ఒక చమత్కారం ఉంది. సురథుడు ముందుగా తాను మున్యాశ్రమానికి వెళ్ళి నప్పటికీ సుమేధసునితో తన కష్టాలను గురించిగానీ, వాటి నివారణ గురించిగానీ పెదవి విప్పి మాట్లాడడు. ఆ ఆశ్రమానికి "సమాధి" వచ్చి, అతనితో స్నేహం చేసిన తర్వాత మాత్రమే ఆ మునితో తన బాధల్ని వివరిస్తాడు. దీనికి కారణం ఏమిటి ? సమాధి అంటే-ఇక్కడ "ఒక వ్యక్తి" అని మనం అర్థం చేసుకోరాదు. "వ్యవసాయాత్మకమైన బుద్ధి" అని అర్థం చేసుకోవాలి. ఆ బుద్ధి చేకూరితేనే తప్ప జీవుడు ప్రయత్నోన్ముఖుడు కాలేదన్నమాట!

మహామాయ మొదట బ్రహ్మను సంరక్షించడానికై యోగనిద్రా రూపిణిగా - తామసీమూర్తిగా - ఆవిర్భవించింది. మధ్యమ చరిత్రలో ఇంద్రాదులను కాపాడేటందుకై దుర్గా, కాత్యాయినీ రూపాలు ధరించింది. ఇంకా తాను అనేక రూపాలను ధరిస్తానని చెప్పింది. దేవ దానవ సంగ్రా

మంలో దేవతా రక్షణ జరిగింది. నిజం ఆలోచిస్తే ఆ యుద్ధం ఎక్కడో స్వర్గంలో జరిగిన యుద్ధం కాదు. మానవ జీవితంలో అనుక్షణం జరుగు తున్న యుద్ధమే అది! మానవ శరీరంలో ఇంద్రియాధిష్టితమైన సాత్విక జ్ఞానవృత్తి రూపమైన చైతన్యం ఒకటుంది. అదే దేవగణం! ఆ విధం గానే తమస్సుతో గూడిన అజ్ఞాన రూపములగు ఇంద్రియ వృత్తులూ ఉన్నాయి. అదే రాక్షసగణం! తమస్సుచేత సత్వమునకు బాధ కలిగినపుడు మాతృ చైతన్యాన్ని శరణువేడటం, ఆత్మరూప సాక్షాత్కారం కలగటం, సత్వగుణం జయించటం, సాధకుడు ముక్తినొందటం జరుగుతుంది.

'కల్పాంతమున విష్ణువు యోగనిద్ర' చెందినాడని సప్తశతిలో ఒక వాక్యము. కల్పాంతమంటే ప్రళయం. ప్రళయంలో సర్వజగత్తు లోపి స్తుంది. అందులోని సర్వజీవుల సమస్త ప్రాణబీజ సముదాయం ఒకచోట సమాహారమౌ తుంది. అట్లా అవటమే విష్ణువు యోగనిద్రలో శేషశయ్యా గతుడైనాడని చెప్పటం 'యోగనిద్ర'-అనగా నిర్గుణబ్రహ్మలో సగుణ భావాన్ని లీనం చెయ్యటం, అప్పుడిక జగద్వ్యాపార ముండదు. "మధు కైటభులు విష్ణు కరణమలోద్భూతులు"గా సప్తశతి పేర్కొన్నది. "విష్ణు కరణ"మంటే చిదాకాశం-ఆకాశము శబ్దగుణకమని చెప్పుటకే అక్కడ "కరణ"శబ్దం ప్రయోగించబడ్డది. "మల" శబ్దానికి ఆవృతమని అర్థం. అనగా కప్పివేయునదన్నమాట! నిర్మలమైన చిదాకాశాన్ని ఆవరించినారు కాబట్టి మధుకైటభులను "విష్ణుకరణ మలోద్భూతా" అనటం జరిగింది.

"మధు" శబ్దమున కర్థం ఆనందం. "కీట"మనగా పురుగు. "కీటభ"మనగా పురుగువలె కనిపించుట. కీటభము యొక్క భావము కైటభము. చిన్న చిన్న క్రిమికీటకముల ఏకత్ర సమాహారము కీటక బాహుళ్యమునకు సూచన. సంచిత కర్మబీజములే మధుకైటభులు.

మధుకైటభులను సంహరించుటకు శ్రీ మహావిష్ణువు నిద్రనుండి లేవవలయును. ఆయన నేత్రముల నావరించిన యోగనిద్రను బ్రహ్మ స్తుతించెను. విష్ణువు మహాప్రాణము. ప్రాణము యొక్క చంచలావస్థయే మనస్సు. చంచలత్వమనగా వైషమ్యము. అటువంటి మనస్సే బ్రహ్మ. అంతఃకరణమునకు నాల్గు వృత్తులుంటాయి. అవి మనోబుద్ధి చిత్త అహంకారములు. అందులో మనస్సు ఒకటి. వాస్తవానికి ఈ నాల్గు ఒక్కటే. చింతించేటప్పుడు చిత్తమనీ, సంకల్ప వికల్పాలు చేసేటప్పుడు మనస్సనీ, నిశ్చయం చేసేటప్పుడు బుద్ధి అనీ, తాదాత్మ్యం చేసేది. అహంకారమనీ వ్యాపార భేదాన్నిబట్టి దానికాపేర్లు కలిగాయి. మనస్సును "బ్రహ్మ" మనటంలో అంతరార్థ మేమంటే-మనోబుద్ధి చిత్త అహంకారములు నాలుగూ ఆయన ముఖములనీ, బ్రహ్మ విష్ణువును స్తుతించాడంటే-మనస్సు రాబోవు జన్మలకు కారణభూతమైన కర్మబీజాల నాశనానికై మహాశక్తిని శరణు వేడినదనీ అర్థం.

మనస్సు అనేది అజ్ఞానగ్రంధీ మూలకంగా నిత్యం సంకల్ప వికల్పాలు చేస్తూ ఉంటుంది. అట్లాకాక మనస్సునంచే ఆనందం పొందేటట్లు చేయటం బ్రహ్మగ్రంథి భేదన మనబడుతుంది. బహుత్వ భావమూలకమైన వాసనారూప సంస్కారం కూడి ఉన్న అంతఃకరణంలోని మలదోషాలను మనస్సు విచ్ఛేదం చేయటమే - "మధుకైటభ సంహారం". ఇది కనక జరిగితే దారేషణ, ధనేషణ, పుత్రేషణ అనే ఈషణత్రయంపై ఆసక్తిగానీ, ఆకాంక్షగాని ఉండదు. ఈ ప్రథమ చరిత్రమున మధుకైటభవధ వల్ల కర్మజతాదాత్మ్యం తొలిగిపోయి,సాధకుడైన జీవుడికి రాబోయే కర్మసంబంధమైన సంస్కారం నశించిపోతుందేగాని సంచిత కర్మసూత్రం మాత్రం అట్లాగే ఉంటుంది. ప్రథమ చరిత్రలోని విషయం మనోమయకోశానికి

సంబంధించింది. మధ్యమ, ఉత్తమ చరితములు రెండు క్రమంగా విజ్ఞానమయ, ఆనందమయకోశాలకు సంబంధించినవి. మనస్సు అనేది మనోమయకోశం వరకూ పోయి ఆగిపోతుంది. విజ్ఞానమయకోశం వరకూ అదిపోదు. వైఖరీవాక్కు దానిని చెప్పలేదు. "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" అని అది వాఙ్మనస్సుల కతీతమైంది. విజ్ఞానమయకోశం పరసంవేద్యం కాదు. స్వసంవేద్యం. అంటే ఆత్మచే ఆత్మ తెలుసుకోబడుచున్నదన్నమాట! ఇక - అప్పుడు జ్ఞాతలేదు. జ్ఞానం లేదు. సర్వం శూన్యం.

మధ్యమ చరితము విజ్ఞానమయకోశానికి సంబంధించినదని మనం చెప్పుకోవటం జరిగింది. అందు అంతఃకరణమునగల విక్షేపము (చంచలము) అనేదోషం శిథిలమౌతుంది. అంతఃకరణం ఏకాగ్రం కావటమే దాని సాధనోద్దేశ్యం. క్రోధానికి మహిషాసురుడు ప్రతీక. కాగా క్రోధమును మహిషరూపంగా దేవికి బలి ఇవ్వటం ఆ దేవికి ప్రీతిదాయకం.

"ప్రవృత్తి (రాక్షసులు) నివృత్తు (దేవతలు) లకు శత సంవత్సరాలు యుద్ధం జరిగింది"దని సప్తశతిలో మరొక విషయం - అంటే నూరుసంవత్సరాల పర్యంతం మానవ జీవితంలో ఈ ఘర్షణ తప్పదన్నమాట! "శత"-అంటే నూరు అనిగాక "అనేక" అనే అర్థం కూడా ఉంది. ఈ సంఘర్షణ నూరు సంవత్సరాలకే పరిమితం గాక అది అనేక జన్మలకు గూడా వ్యాపించవచ్చు. దీనిభావమేమిటంటే - అనేక జన్మలలో సాధనచేయగా చేయగా, సిద్ధుడై ఏ జన్మలోనో జీవుడు ముక్తి నొందుతాడు. అటువంటి మహాయుద్ధంలో దేవతలు ఓడిపోయారు. అంటే ప్రవృత్తి జయించింది. దీనికి కారణం జన్మజన్మాంతరములయందు ప్రోగుచేసుకొన్న కర్మ సంస్కారం జీవుణ్ణి సంసార విషయాభిముఖుణ్ణిగా చేసి,

ఆసురప్రవృత్తిని జయించలేని దౌర్బల్యస్థితిని కలిగించటమే! నివృత్తి ఓడిపోయినప్పుడు మహిషాసుర ప్రవృత్తి (రజోగుణం) ఇంద్రత్వం పొందుతుంది. అనగా అధికారం చెలాయిస్తుంది.

"పద్మయోని బ్రహ్మను ముందుంచుకొని, ఈశ్వరుని వద్దకూ, విష్ణువు వద్దకూ, దేవతలు వెళ్ళిరి" అని మరొకటి. బ్రహ్మ అనగా మనస్సు. దీన్ని ముందుంచుకొని ఈశ్వరుని (జ్ఞానమును) విష్ణువు (ప్రాణము) దగ్గరికి దేవతలు (నివృత్తి) పోయినారని ఆ వాక్యము యొక్క అర్థము.

"త్రిమూర్తుల నుండి - సమస్త దేవతల నుండి ఒక తేజం ఉద్భవించింది. అది ఒకచోట రాశీభూతమై స్త్రీ రూపం ధరించింది." సాధన వల్ల చిత్తం స్థిరమైనప్పుడు ప్రశాంతత కలుగుతుంది. అప్పుడు విశిష్టమైన జ్యోతిఃపుంజ మొకటి ఆవిర్భవిస్తుంది. యోగంలో దానికి "విశోక", "జ్యోతిష్మతి" అనే పేర్లు వున్నాయి. దాని సందర్శనంవల్ల సాధనలో దృఢత్వం కలుగుతుంది. స్త్రీ రూపాన్ని ధరించటమంటే శక్తిరూపాన్ని ధరించటం. "శక్తి సింహనాదము చేసిన''దట! ఇక్కడ "నాద''మంటే మామూలు శబ్దం కాదు. అది అనాహత నాదం! ఈ నాదమే మంత్ర జపమువల్ల ప్రభావితమై, ఏకాగ్రతను పొంది శ్రుతి గోచరమౌతుంది. దుర్గాదేవికి వాహనమైన సింహము హింసా ప్రవృత్తికి ప్రతీక. మనుష్యుడు తన జీవత్వ భావాన్ని హింసించి (నష్టపరచి) బ్రహ్మత్వ భావాన్ని ప్రకాశింప జేసినప్పుడు అతడు సింహ ధర్మము కలవాడౌతాడు. అటువంటి జీవుల్లోనే దుర్గాదేవి వెలసి వుంటుంది.

మధ్యమ చరిత్ర ప్రతిపాదించే "చిత్-చేతన-చైతన్యము'' బుద్ధి ద్వారా లభిస్తుంది. ప్రపంచంలో సమిష్టి లేక వ్యష్టి రూపాలలో చేతనాన్ని

చూడటం, అన్నింటియందు తన చేతననూ ప్రాణాన్ని ఆరోప మొన ర్చటం దృఢంగా అభ్యసించినట్లయితే చిత్త విక్షేపం తొలగిపోతుంది. జీవుడి వ్యష్ట ప్రాణం సమిష్టి ప్రాణంతో కలిపితేనే తప్ప (ఏకమైతేనే తప్ప) విష్ణు గ్రంథి భేదనం జరుగదు. విష్ణుగ్రంథి భేదనం జరిగినప్పుడు కామ వాసనల సంచారం వుండదు. కాని కర్తృత్వ బోధ జనించటం వల్ల జ్ఞానం మరుగునపడి కర్మయందు ప్రేరితుడవుతాడు. ఇందుకు అతని "అతృప్తి" కారణం. తృప్తి అనగా ఆనందం. జీవుడి ఉత్పత్తి స్థితిలయ ములు ఈ ఆనందం మీచే ఆధారపడి వుంటాయి. "ఆనందాదేవఖల్విమాని భూతాని జాయంతే, ఆనందేవభూతాని జీవంతి. ఆనందేనవిశంతి". ఆనం దమే జీవుని చరమ లక్ష్యము.

మధ్యమ చరిత్ర వలన విజ్ఞానమయ కోశాన్ని అధిష్టించి నప్పటికీ, జ్ఞాన వికాసం జరిగినప్పటికీ సాధకుడు ఆనందానుభవం పొందలేడు. దాని ప్రాప్తి కోసం మరికొంత సాధనం చేయవలసి వుంటుంది. అపరోక్ష జ్ఞానం చేత ఆత్మానందం లభిస్తుంది. విజ్ఞానమయకోశంలో ప్రాణరూప విష్ణుప్రాప్తి ఏర్పడదు. దానికి అవ్యవహితముగా - వెంటనే - ఆనంద మయ కోశమున రుద్రుని ఉపలబ్ధి లభిస్తుంది. హరిహరాత్మకమైన స్థితి అది! ప్రాణము ప్రతిష్టితం కాగానే జ్ఞానం కలుగుతుంది. ఏ మాత్రం ఆలస్యం వుండదు. కనుకనే తధిష్టాతయైన రుద్రుణ్ణి "అశుతోషు" డంటారు. జ్ఞానం అందరిలోను వుంటుంది. కాని "ఆవరణం" తొలగి తేనే గాని అది భాసించదు. ఆ ఆవరణం తొలగిపోవటమే రుద్రగ్రంథి భేదనం. ఈ గ్రంథి భేదనం జరిగిన తర్వాత జీవుడు తన ప్రారబ్ధాన్ని అనుభవిస్తున్నప్పటికీ తాను దుఃఖితుడనుకోడు. కేవలము తాను సాక్షిభూతు డను మాత్రమేనని తెలుసుకోవటంవల్ల సుఖదుఃఖాల చేతికిచిక్కడు. సప్త

శతిలో ప్రథమ చరిత్రమున సత్ ప్రాప్తి, మధ్యమ చరిత్రమున చిత్ ప్రాప్తి, ఉత్తమ చరిత్రమున ఆనంద ప్రాప్తి చేకూరుతుంది. మొత్తము మీద సచ్చిదానంద రూపమైన పరమేశ్వర ప్రాప్తియే సప్తశతి లక్ష్యమని మనకు విశదమవుతుంది.

సప్తశతిలోని రహస్యాలను పట్టుకునేందుకు చేసిన దిఙ్మాత్ర ప్రయత్నము మాత్రమే ఇది! ఇంకా ఎన్నెన్నో అమూల్య రహస్యాలున్నాయి. సప్తశతిలో "శుంభుడు" అహంకారానికీ, "నిశుంభుడు" మమకారానికీ ప్రతీకలు. "ధూమ్రలోచనుడు" భ్రాంతికి ప్రతీక. "చండముండులు" క్రమంగా మూల అజ్ఞానానికీ, తూల అజ్ఞానానికీ ప్రతీకలు. (మూల అజ్ఞానం శుద్ధ చేతనను ఆచ్ఛాదిస్తుంది. తూల అజ్ఞానము ఘటాద్యవచ్ఛిన్న చేతనను ఆచ్ఛాదిస్తుంది). శుంభనిశుంభులు ఎనిమిది రకాలుగా రాక్షస సేనను సిద్ధపరిచారని చెప్పటంలో - ఆధ్యాత్మిక భావంలో ఆ ఎనిమిది 1) ఘృణ 2) లజ్జ 3) భయం 4) శంక 5) జుగుప్స 6) కులము 7) శీలము 8) జాతి అనే ఎనిమిది పాశాలు. ఈపాశాల్లోంచి విముక్తుడైన జీవుడు శివుడు అవుతాడు. రక్తబీజుడు - అంటే భోగవాంఛ. భోగాలను అనుభవిస్తున్న కొద్దీ ఆ వాంఛ మరింత ప్రబలుతూ వుంటుంది. ఇంద్రియాల్లో జిహ్వేంద్రియం చాలా ప్రబలమైంది. కామాన్ని జయించాలంటే ముందుగా మనం జిహ్వను జయించవలసివుంటుంది. రక్తబీజవధ కాళిక కరాళ జిహ్వతో జరగటం గమనార్హం. "శుంభుని వధించుట" అనగా అహంకారమును నాశన మొనరించుట. "నిశుంభునివధ" అనగా మోహమును పటాపంచలు చేయుట. ఆవధతో ఆత్మసాక్షాత్కారం కలిగి ప్రతిచోట ఆనంద మనుమగు సత్తా (సత్) భాసిస్తుంది. అపరో

జ్ఞాన ప్రాప్తిచే సాధకుని రుద్రగ్రంథి శిథిలమై, జీవన్ముక్తి చేకూరి, సాధకుడు సచ్చిదానంద రూపుడవుతాడు.

## ఉప సంహారం :

సప్తశతి మార్కండేయ పురాణాంతర్గతము. మార్కండేయ క్రోష్టుల సంవాదాత్మకం. మార్కండేయుడు వక్తయే గాని కవిగాడు. కనుకనే వేదమువలె ఇది అపౌరుషేయము. ఈ సప్తశతికి మూలము వేదములందే గలదు. ఋగ్వేదమున దేవీ సూక్తమున "వాగంభృణీ సంవాదం''లో దేవీ మాహాత్మ్య ప్రశస్తి వుంది. దేవీ మాహాత్మ్యం చివర "దేవీ సూక్తం పరం జపన్" అని దేవీ సూక్త ప్రశంస వుంది.

మేరుతంత్రంలో "సప్తశతి మొత్తం నేనెరుంగుదును. పావు తక్కువగా హరి ఎరుగును. నాల్గవ భాగం వ్యాసుడు ఎరుగును. కోటి భాగము ఇతరు లెరుగుదురు" అని శివుడు చెప్పినట్లున్నది. డామర తంత్రంలో "యజ్ఞాల్లో అశ్వమేధం వలె, దేవతల్లో విష్ణువు మాదిరి, స్తోత్రాలలో సప్తశతి మిగుల ప్రధానమైంది. ఇది భక్తిముక్తులను ప్రసాదిస్తుంది'' అని కలదు.

సప్తశతి గొప్ప అర్థశాస్త్రము. అనగా సర్వ పురుషార్థములను, సమస్త జీవిత లక్ష్యాలనూ సాధించే గ్రంథం అది. కాబట్టి దాని లక్ష్యం పరిమితము గాదు. ఏకపక్షంగాదు-సర్వలక్ష్య సాధనమైన గ్రంథం అది! అనేక ఆధ్యాత్మిక మహారహస్యాలకు అది మహాఖని. దాని పారాయణం ఇహపర సౌఖ్యదాయకమై విరాజిల్లుతుంది.

## సప్తశతి పారాయణ క్రమము :

మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతుల ప్రతిపాదకాలైన

మంత్రాల్లో నవార్ణము, సప్తశతీ (మూల మంత్రం) అనేవి రెండే ముఖ్యమైనవి. ఈ రెండింటిలో ఉపాసన భేధాన్ని అనుసరించి ఒకటి ప్రధానమైతే మరొకటి ఉపసర్జనంగా (అంగంగా) ఉంటుంది. నవార్ణ ప్రధానమైతే సప్తశతి దానికి అంగము అవుతుంది. అప్పుడు సాధకుడు నవార్ణ మంత్రాన్ని ప్రధానంగా జపించి, దానికి అంగంగా సప్తశతిని పఠిస్తాడు. సప్తశతిని ప్రధానంగా పఠించేవాడు రహస్యోక్తి ప్రకారంగా యంత్రమున సప్తశతి దేవతను పూజించి, ఆ తర్వాత దానికి అంగంగా ముందూ వెనుకా నవార్ణ మంత్రాన్ని పఠించవలసి వుంటుంది.

## నవార్ణ మంత్రం-అర్థం :

సప్తశతీ పారాయణానికి ముందు వెనుకల నవార్ణ మంత్రాన్ని విధిగా జపించాలని చెప్పినందు వల్ల, దాని అర్థాన్ని మనం తెలుసుకోవలసిన అవసరముంది. "దేవీ అథ్వర శీర్షం"లో ఇట్లా చెప్పబడింది.

"వాఙ్మయాబ్రహ్మసూస్తస్మాత్ షష్ఠం వక్త్రసమన్వితం
సూర్యోనామ శ్రోత్ర బిందుసంయుక్తష్టాత్తృతీయకః
నారాయణేన సంమిశ్రో వాయుశ్చా ధరయున్ తతః
విచ్చే నవార్ణ కోఽర్ణస్యాత్ మహదానంద దాయకః

వాగ్భవ బీజం (ఐం), మాయాబీజం (హ్రీం), కామబీజం (క్లీం) అనే మూడు బీజాలకూ "చాముండాయై విచ్చే" అనే దాన్ని కలిపితే నవార్ణ మంత్రము ఏర్పడుతుందని ఈ శ్లోకం చెబుతున్నది. "నిర్ధూతనిఖిల ధ్వాంతే నిత్యముక్తే పరాత్పరే, అఖండ బ్రహ్మ విద్యాయై చిత్సదానంద రూపిణీ" ఇత్యాదిగా ఈ నవార్ణ మంత్ర మహిమ డామర తంత్రంలో వ్యక్తం చేయబడింది. ఈ నవార్ణవ మంత్రంలోని తొమ్మిది అక్షరాలు తొమ్మిది మంది దుర్గలకు ప్రతీకలు. 'విచ్చా' అనేది

లప్తి దేవతనీ, అది ప్రళయ కాలంలో ప్రళయాన్ని సాధకునికి బోధి స్తుందనీ పెద్దలు చెబుతారు. ఊర్ధ్వామ్నాయంలో ఈ దేవి విచ్చేశ్వరి,హంసే శ్వరి,సంవ త్రేశ్వరిఅనిమూడు విధాలుగాకీర్తింపబడింది.'విచ్చే'అన్నపదాన్ని విభజిస్తే 'విత్+చ+ఇ' అని ఏర్పడుతుంది. ఈ మూడు అక్షరాలు చిత్, సత్, ఆనంద వాచకాలు. 'ఇ' అంటే ఆనంద బ్రహ్మమహిషి. 'విత్' అనేది జ్ఞానపరంగా ప్రసిద్ధమైన చకారము. సత్ పదము 'చాముండీ' అనే దానికి మోక్షానికి కారణమైన నిర్వికల్పక జ్ఞానమని అర్థం. చండ ముండులనే రాక్షసుల్ని సంహరించటం చేత ఆ దేవికి 'చాముండా' అనే పేరు వచ్చినట్లు పురాణం చెబుతున్నది. అసలు రహస్యమేమిటంటే 'చండముండులు' 'మూల (సమిష్టి) తూల (వ్యష్టి) అజ్ఞాన రూపాలు. వాళ్ళను వధించటం చేత అఖండ బ్రహ్మవిద్య 'చాముండ' అనిపేర్కొన బడింది.

## సప్తశతి-నవసంఖ్య ప్రాముఖ్యం :

శాక్తేయంలో నవసంఖ్యకు చాలా ప్రాముఖ్యము ఉంది. చండీ మంత్రం చూస్తే అది నవాక్షరి. ఆవరణలు తొమ్మిది. చాముండీ స్వరూపాలు 1) పీఠచాముండీ 2) వ్యాఘ్రచాముండీ 3) రక్త చాముండీ 4) భద్ర చాముండీ 5) శ్వేతచాముండీ 6) సిద్ధచాముండీ 7) ఉగ్రచాముండీ 8) ఘోర చాముండీ 9) మహాచాముండీ అని తొమ్మిది విధాలు.

1) జలదుర్గ 2) శైలదుర్గ 3) శూలినీదుర్గ 4) శివదుర్గ 5) జయ దుర్గ 6) కిరాతదుర్గ 7) హోమదుర్గ 8) చింతామణిదుర్గ 9) అగ్నిదుర్గ అని దుర్గలు తొమ్మిది విధాలు.

ఉత్తమ చరితమున కౌశికీదేవికి సహాయపడిన దేవతలు తొమ్మిది మంది. వాళ్ళు 1) బ్రాహ్మణీ 2) మాహేశ్వరి 3) కౌమారి 4) వైష్ణవి 5) వారాహి 6) నారసింహి 7) ఐంద్రి 8) చండిక 9) కాళి అనే వాళ్ళు.



ప్రథమా శైలపుత్రీతి ద్వితీయా బ్రహ్మచారిణీ
తృతీయా ఛన్నఘంటేతి కూష్మాండేతి చతుర్థకీ
పంచమా స్కందమాతేతి షష్ఠా కాత్యాయనేతి చ
సప్తమా కాలరాత్రీ చ అష్టమా చాతీ భైరవీ
నవమా సర్వసిద్ధిశ్చాత్ నవదుర్గా ప్రకీర్తితాః"

అని మరో శ్లోకం వినబడుతున్నది. 

రెండేళ్ళ వయస్సు నుంచి పదేళ్ళ వరకూ వున్నకన్యలకు వరుసగా 1) కుమారి (రెండేళ్ళ వయస్సు) 2) త్రిమూర్తి (మూడేళ్ళు) 3) కల్యాణి 4) రోహిణి 5) కాళిక 6) చండికా 7) శాంభవి 8) దుర్గా 9) సుభద్ర (పదేళ్ళ వయస్సు) అనే పేర్లున్నవి. 

ఇట్లా చండికలూ, చక్రాలూ, యోనులూ, కాళికలూ, శ్యామలలూ మొదలైనవన్నీ నవసంఖ్యలోనే మనకు కనిపిస్తాయి. ముఖ్యంగా ఈ దేవీ పూజ నవరాత్రుల్లో (రోజుల్లో) చేయటం అనవాయితీగా వస్తున్నది. ఈ తొమ్మిది అనే సంఖ్య నవ రంధ్రాలతో కూడిన మన దేహంలో ఉన్న కుండలినీ శక్తి జాగరణకు సంబంధించినదిగా మనకు సూచిస్తున్నది.

**సప్తశతి పాఠ క్రమము :**

సాధకుడు శుచిస్నాతుడై ఆసనమున కూర్చుండి ఆచమన, ప్రాణా

యామ సంకల్పములను చేసి, మాతృకా న్యాసము చేయాలి. చండీని ధ్యానించి, రహస్యోక్త ప్రకారముగా యంత్రమును పూజించి, కవచ, అర్గళ, కీలకములను, రాత్రి సూక్తమును పఠించి, నవార్ణ మంత్రమును కనీసము 108 పర్యాయములు జపించవలసి ఉంటుంది. సప్తశతి పారాయణా నంతరము నవార్ణ మంత్రమును మరల 108 పర్యాయములు జపించి, ఆ జపమును దేవికి ధారపోసి, దేవీ సూక్తమును పఠించి, రహస్య త్రయ పారాయణము చేయాలి. ఆఖరున ప్రార్థనా మంత్రములతో దేవికి క్షమాపణ చెప్పాలి.

సప్తశతి పారాయణ విధము అనేక మంత్రముల ననుసరించి అనేక విధములుగా కనబడుచున్నది. ఎవరికి వారు వారివారి గురు సంప్రదాయము ననుసరించి చేయటం మంచిది. మరీచి కల్పాన్ని అనుసరించి మొదట రాత్రి సూక్తము, తరువాత సప్తశతి, చివరకు దేవీ సూక్తము పఠించవలెను. డామర తంత్రములో 'కవచ అర్గళ కీలకములు మొదట పఠించి, ఆ తర్వాత సప్తశతిని పఠించవలెను. చివరకు రహస్య త్రయ మును పఠించవలెను' అని చెప్పబడింది. సప్తశతికి ముందు వెనకల 'శతమేకం భైరవీ పునాతు' అనే శక్తి న్యాస ప్రమాణాన్ని అనుసరించి నూట ఒక్కటి చొప్పున నవార్ణ మంత్రాన్ని జపించాలి. రాత్రి సూక్త, దేవీ సూక్తములు -వైదికములు, పౌరాణికములని రెండువిధాలు. వైదికులు మొదటి దాన్ని, ఇతరులు రెండవ దాన్ని అనుసరించుట మంచిది.

ఒక దిన పారాయణలో మొదట మధ్యమ చరిత్రమును, తరువాత ప్రథమ, తృతీయ చరిత్రలను పారాయణము చేయవలెను. కీలక వ్యాఖ్యానములో ఈ సంగతి వివరముగా చెప్పబడినది. ఒక్క రోజులో మొత్తము గ్రంథము పారాయణము చేయలేనివారు మొదటి దినము ప్రథమ అధ్యా

యము, రెండవ రోజు 2, 3, మూడవరోజు 4, నాలుగవరోజు 5, 6, 7, 8, ఐదవరోజు 9, 10, ఆరవరోజు 11, ఏడవరోజు 12, 13 అధ్యాయములు చొప్పున ఏడు దినములలో పారాయణము చేయ వచ్చును. ఇది పై దిశాగమ పద్ధతి.

## సప్తశతిని పఠించే పద్ధతి :

దేవిని ధ్యానించి. లమిత్యాది పంచపూజలు చేసి, మూలయంత్రము గల పీఠముపై గ్రంథముంచవలెను. గ్రంధపఠన సమయమున దీర్ఘములు తీయరాదు. త్వరగా చదువరాదు. తల నూపరాదు. అర్థం చేసుకొంటూ చదవవలెను, అల్ప కంఠముతో చదువరాదు. అధ్యాయము మధ్య ఆప రాదు. అట్లు ఆపవలసి వచ్చిన చదువుచున్న అధ్యాయమును మరల మొదటి నుంచి ప్రారంభించి చదువవలెను. పుస్తకమును చేతబట్టి కాక, వ్యాస పీఠమున నుంచి, పఠించుట శ్రేష్ఠము. మానసికంగా పారాయణము చేయరాదు. పైకి చదివిన యెడల, చదివే శ్లోకాల నుండి ఒక దివ్య శక్తి బయలుదేరి ఆ శబ్ద తరంగాలు పరిసరాలను పవిత్రం చేస్తాయి. పారాయణ ప్రదేశం నుండి వెలువడిన కాంతి పుంజాలు సాధకునికి ఆనంద తన్మయ త్వాన్ని కలిగిస్తాయి. దేవీ భక్తిని దృఢతరం చేస్తాయి.

## సప్తశతిలోని మహామంత్రాలు :

సాధకులు తమ కోరిక ననుసరించి సప్తశతిలోని చరిత్రయందు గల ఒక్కొక్క మంత్రాన్ని జపము చేయవలసి వుంటుంది. ఆయా శ్లోక ముల సంపుటితో సప్తశతి పారాయణం చేసిన ఆయా లాభములుకలుగును. ఆ శ్లోకములు ఈ క్రింద సాధకుల సౌకర్యార్థము ఇచ్చుట జరిగినది.

'జయంతీ మంగళీకాళీ' అను శ్లోక సంపుటితో సప్తశతీ పారాయణము

చేసిన మహామారి తొలగును. 'మధుకైటభ విద్రావి' అనే శ్లోకంతో పారాయణం చేస్తే రాజచోర భయనాశం కలుగుతుంది.

మధుకైటభనిర్నాశి-రిపుక్షయం

వందితాంఘ్రియుగకే-రాజసమ్మానము

రక్తబీజవధే-శత్రుశ్రేణి నిర్మూలనం

అచింత్యరూపచరితే-రోగ నివారణం

నతేభ్యస్సర్వదాభక్త్యా-సర్వాపద నివారణం

స్తువద్భ్యోభక్తిపూర్వం-వ్యాధినాశం

చండికేసతతం-సర్వసౌభాగ్యసిద్ధి

దేవీభక్తజన-అనావృష్టి నివారణం

సురాసురశిరోరత్న-సర్వజ్ఞత్వం

ఇట్లా అనేక మంత్రాలకూ అనేక ఫలాలు చెప్పబడ్డాయి. వీటిని తెలిసిన పెద్దల దగ్గరనుంచి గ్రహించటం ఉత్తమం. సప్తశతిని ఉపసర్గ శాంతికై మూడు సార్లు, గ్రహదోష నివారణకై ఏడుసార్లు, మహాదోష నివారణకై ఏడుసార్లు, సిద్ధసిద్ధికి నూరుసార్లు పారాయణము చేయవలె నని అభిజ్ఞుల అభిప్రాయం.

సృష్టికి పూర్వం దేవి ఆత్మ (చైతన్య) రూపిణియై ఉందని శాస్త్రాలు చెబుతున్నాయి. ఆ ఆత్మకు అనాది స్థిరమైన, అనిర్వచనీయమైన శక్తి ఉంది. దానికే మాయ అని పేరు. ఈ మాయ, బ్రహ్మ అభిన్నాలు. బ్రహ్మకంటే మాయా శక్తి వేరుగాదు. ఆ రెంటినీ మనం వేరు చేయలేం. చంద్రుడు- చంద్రిక, అగ్ని- దాహకశక్తి ఇట్లా ఆ మాయా- బ్రహ్మలు

అభిన్నాలు. సృష్టిని మాయ ఉపాదాన (సమవాయ) కారణం. మాయ యందు ప్రతిఫలించిన బ్రహ్మ నిమిత్త కారణం. మాయకు తపమనీ, తమ మనీ, జడమనీ, ప్రకృతిఅనీ, శక్తి అనీ, విమర్శ అనీ అవిద్య అనీ అనే కులు అనేక రకాలుగా పిలుస్తున్నారు. మాయా సహిత బ్రహ్మను అవ్యా కృతము, అవ్యక్తము, మాయాశబలము, సర్వకారణ కారణము, సచ్చిదా నంద విగ్రహము. ఇట్లా అనేక విధాలుగా పిలుస్తారు. అదే చండీతత్వము.

పురుషుడు ప్రకృతియందు అంశ రూపమున ప్రవేశించి 'జీవు'డనే పేరుతో పిలువబడుచున్నాడు. జీవుడు ప్రకృతికి వశుడై అహంకారాలతో స్వస్వరూప జ్ఞానమును విస్మరించి, తన ఉపాధికి సంబంధించిన వాటి యందు మోహపరవశుడవుతున్నాడు. చిదానందాలకు దూరమవుతున్నాడు. కర్మవశమున జనన మరణ చక్రమున తగుల్కొని పరిభ్రమిస్తున్నాడు. ఈ కష్ట దశను తప్పించుకొని మరల తన పూర్వ నిత్యానంద నిర్వికల్ప స్థితినెంచుటయే మోక్షము. అ ఉత్తమ పురుషార్థమును సిద్ధింపజేసుకొనుటకే సాధకులకు కల్పవృక్షమై సప్తశతి అవతరించింది. ఈ సప్తశతి పారాయ ణము వల్ల ప్రతి ఒక్కడు ఐహికాముష్మిక సుఖములను పొందగలడు.

ఉపవీతుడు కాని వానికి మంత్ర జప పూజార్హత లేదు, ధీ-ధీయంతే (జ్ఞానవిజ్ఞానముల నిచ్చేది) క్ష-క్షయంతీ (పాపాదులను నాశనం చేసేది) ఏదో అది దీక్ష. సద్గురువుల వలన దీక్ష పొంది, సాధకుడు మంత్ర జప పూజలతో సప్తశతి పారాయణము చేయుట ప్రశస్తము.

ఓం తత్సత్



# సిద్ధ కుంజికా స్తోత్రమ్

శృణు దేవి ప్రవక్ష్యామి కుంజికా స్తోత్రముత్తమమ్, యేన మంత్ర ప్రభావేన చండీజాపః శుభో భవేత్. న కవచం నార్గళాస్తోత్రం కీలకం న రహస్యకమ్. న సూక్తం నాపి ధ్యానం చ న్యాసో న చవార్చనమ్. కుంజికా పాఠ మాత్రేణ దుర్గాపాఠ ఫలం లభేత్, అతి గుహ్యతరం దేవి దేవానామపి దుర్లభమ్. గోపనీయం ప్రయత్నేన స్వయోనిరివ పార్వతీ మారణం మోహనం వశ్యం స్తంభనోచ్చాటనాదికమ్. పాఠమాత్రేణ సంసిద్ధ్యేత్ కుంజికా స్తోత్ర ముత్తమమ్. అథమన్త్రః ఓం ఐం హ్రీంక్లీం చాముండాయైవిచ్చే ఓం గ్లౌం హుం క్లీం జూం సః జ్వాలయ జ్వాలయ, జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే జ్వల హం సం లం క్షం ఫట్ స్వాహా.

నమస్తే రుద్ర రూపిణ్యై నమస్తే మధుమర్దిని నమః కైటభ హారిణ్యై నమస్తే మహిష మర్దిని, నమస్తే శుంభ హంత్ర్యై చ నిశుంభాసుర ఘాతిని, జాగ్రతం హి మహాదేవి జపం సిద్ధం కురుష్వమే, ఐంకారీ సృష్టిరూపాయై హ్రీంకారీ ప్రతిపాలికా, క్లీంకారీ కామరూపిణ్యై బీజరూపే నమోఽస్తుతే, చాముండా చండఘాతీ చ యైకారీ వరదాయినీ, విచ్చే చాభయదా నిత్యం నమస్తే మంత్రరూపిణే, ధాం ధీం

ధూర్జ టేః పత్నీ వాం వీం వృం వాగధీశ్వరీ క్రాం క్రీం క్రం
కాలికా దేవి శాం శీం శూం మే శుభం కురు. హుం హుం
హుంకార రూపిణ్యై జం జం జంభనాదినీ, భ్రాం భ్రీం భ్రూం
భైరవీ భద్రే భవాన్యంతే నమో నమః. అం కం చం టం
తం పం యం సం వీం దుం ఐం వీం హం క్షం ధిజాగ్రజం
ధి జాగ్రజం, త్రోటయ త్రోటయదీప్తం కురు కురు స్వాహా.
పాం పీం పూం పార్వతీ పూర్ణా ఖాం ఖీం ఖ్నూం ఖేచరీ తథా.
సాం సీం సూం సప్తశతీ దేవ్యా మంత్ర సిద్ధిం కురుష్వమే.
ఇదంతు కుంజికా స్తోత్రం మంత్ర జాగర్తి హేతవే. అభక్తే
నైవ దాతవ్యం గోపితం రక్ష పార్వతి. యస్తు కుంజికయా
దేవి హానాం సప్తశతీం పఠేత్, న తస్య జాయతే సిద్ధిరరణ్యే
రోదనం యథా. ఇతి శ్రీ రుద్రయామలే గౌరీ తంత్రే శివ
పార్వతీ సంవాదే సిద్ధ కుంజికాస్తోత్రం సంపూర్ణమ్.

– (0) –

# దుర్గాష్టోత్తర శతనామ స్తోత్రమ్

ఈశ్వర ఉవాచ : శతనామం ప్రవక్ష్యామి శృణుష్వ కమలాననే యస్య ప్రసాద మాత్రేణ దుర్గా ప్రీతా భవేత్ సతీ. 1. ఓం సతీ సాధ్వీ భవప్రీతా భవానీ భవ మోచనీ ఆర్యా దుర్గా జయా చాద్యా త్రినేత్రా శూల ధారిణీ. 2. పినాక ధారిణీ చిత్రా చండఘంటా మహాతపా మనోబుద్ధి రహంకారా చిత్త రూపా చితా చితిః. 3. సర్వ మంత్రమయీ సత్తా సత్యానంద స్వరూపిణీ అనంతా భావినీ భావ్యా భవ్యాఽభవ్యా సదాగతిః. 4. శాంభవీ దేవమాతా చ చింతా రత్న ప్రియా సదా సర్వ విద్యా దక్షకన్యా దక్ష యజ్ఞ వినాశినీ. 5. అపర్ణాఽనేకవర్ణా చ పాటలా పాటలా వతీ పట్టాంబర పరీధానా కలమంజీర రంజినీ. 6. అమేయ విక్రమాక్రూరా సుందరీ సుర సుందరీ వనదుర్గా చ మాతంగీ, మతంగ ముని పూజితా, 7. బ్రాహ్మీ మహేశ్వరీ చైంద్రీ కౌమారీ వైష్ణవీ తథా చాముండా చైవ వారాహీ లక్ష్మీశ్చ పురుషాకృతిః. 8. విమలోత్కర్షిణీ, జ్ఞానా క్రియా నిత్యా చ బుద్ధిదా, బహుళా బహుళ ప్రేమా సర్వవాహనవాహనా. 9. నిశుంభ శుంభహననీ, మహిషాసుర మర్దనీ, మధుకైటభ హంత్రీ చ చండముండ వినాశినీ. 10. సర్వాసుర వినాశా చ సర్వ దానవ ఘాతినీ, సర్వశాస్త్రమయీ, సత్యా సర్వాస్త్ర ధారిణీ తథా. 11. అనేక శస్త్ర హస్తా చ అనే

కాంత్రస్య ధారిణీ కుమారీ చైవ కన్యా చ కైశోరీ యువతీ యతిః. 12. అప్రౌఢా చ వృద్ధమాతా బలప్రదా మహో దరీ ముక్తకేశీ ఘోర రూపా మహాబలా. 13. అగ్నిజ్వాలా రౌద్రముఖీ కాళరాత్రి స్తపస్వినీ నారాయణీ భద్రకాళీ విష్ణుమాయా జలోదరీ. 14. శివదూతీ కరాళీ చ అనంతా పరమేశ్వరీ క్యాత్యాయనీ చ సావిత్రీ ప్రత్యక్షా బ్రహ్మ వాదినీ. 15. య ఇదం ప్రపఠేన్నిత్యం దుర్గా నామ శతా ష్టకం నా సాధ్యం విద్యతే దేవి త్రిషులోకేషు పార్వతి. 16. ధనం ధాన్యం సుతం జాయాం హయం హస్తిన మేవ చ చతుర్వర్గం తథా చాంతే లభేన్ముక్తించ శాశ్వతీ. 17. కుమారీం పూజ యిత్వా తు ధ్యాత్వా దేవీం సురేశ్వరీం పూజయేత్ పరయా భక్త్యా పఠేన్నామ శతాష్టకం. 18. తస్య సిద్ధిర్భవేత్ దేవీ సర్వైః సురవరై రపి రాజానో దాస తాం యాంతి రాజ్య శ్రియ మవాప్నుయాత్. 19. గోరో చనా లక్తక కుంకుమేన సిందూర కర్పూర మధుత్రయేణా, విలిఖ్య యంత్రం విధినా విధిజ్ఞోభవేత్ సదా ధారయతే పురారిః. 20. భామావాస్యా నిశామధ్యే చంద్రే శతభి షాంగతే విలిఖ్య ప్రపఠేత్ స్తోత్రం స భవేత్ సంపదాం పదం. 21. ఇతి శ్రీ విశ్వసారతంత్రే దుర్గాష్టోత్తర శతనామ స్తోత్రం సమాప్తం.

...0...

# అర్గలా స్తోత్రమ్

ఓం అస్య శ్రీ అర్గలా స్తోత్ర మంత్రస్య, విష్ణుః ఋషిః అనుష్టుప్ ఛందః శ్రీ మహాలక్ష్మీర్దేవతా, శ్రీ జగదంబా ప్రీతయే, సప్తశతీ పాఠాంగత్వేన జపే వినియోగః.

ఓం నమశ్చణ్డికాయై పరాశక్త్యంబికాయై నమః.

మార్కణ్డేయ ఉవాచ : ఓం జయ త్వం దేవి చాముణ్డే జయ భూతాపహారిణీ । జయ సర్వగతే దేవి కాళరాత్రి నమోఽస్తుతే॥ జయన్తీ మఙ్గళా కాళీ భద్రకాళీ కపాలినీ। దుర్గా శివా క్షమాధాత్రీ స్వాహా స్వధా నమోఽస్తుతే॥ మధుకైటభ విధ్వంసి విధాతృవరదే నమః। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి॥ మహిషాసుర నిర్నాశి భక్తానాం సుఖదే నమః। రూపం దేహిజయం దేహి యశో దేహి ద్విషోజహి ॥ ధూమ్రనేత్రవధే దేవి ధర్మకామార్థదాయిని। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషోజహి ॥ రక్తబీజవధే దేవి చణ్డముణ్డవినాశిని। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి॥ నిశుమ్భశుమ్భ నిర్నాశి త్రైలోక్య శుభదే నమః। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ వన్దితాఙ్ఘ్రియుగే దేవి సర్వ సౌభాగ్యదాయిని। రూపం దేహి జయం

దేహి యశో దేహి ద్విషో జహి ॥ అచిన్త్య రూప చరితే సర్వ శత్రు వినాశిని । రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ నతేభ్యః సర్వదా భక్త్యా చాపర్ణే దురితాపహే । రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ స్తువద్భ్యో భక్తి పూర్వం త్వాం చణ్డికే వ్యాధినాశిని । రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ చణ్డికే సతతం యుద్ధే జయన్తి పాపనాశిని। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ దేహి సౌభాగ్య మారోగ్యం దేహి దేవి పరం సుఖమ్ । రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ విదేహి దేవి కల్యాణం విదేహి విపులాం శ్రియమ్। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ విధేహి ద్విషతాం నాశం విధేహి బలముచ్చకైః । రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ సురాసుర శిరో రత్న నిఘృష్ట చరణేఽమ్బికే। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ విద్యావన్తం యశస్వన్తం లక్ష్మీవన్తఞ్చ మాంకురు। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ దేవి ప్రచణ్డ దోర్దణ్డ దైత్య దర్పని షూదిని। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ ప్రచణ్డ దైత్య దర్పఘ్నే చణ్డికే ప్రణతాయమే । రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥

చతుర్భుజే చతుర్వక్త్ర సంస్తుతే పరమేశ్వరి। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి॥ కృష్ణేన సంస్తుతే దేవి శశ్వద్భక్త్యా సదాంబికే। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ హిమాచల సుతా నాథ సంస్తుతే పరమేశ్వరి । రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి॥ ఇన్ద్రాణీపతి సద్భావన పూజితే పరమేశ్వరి। రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి॥ దేవి భక్తజనోద్ధానుదత్తా నన్దోదమేఽమ్బికే । రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ భార్యాం మనోరమాం దేహి మనోవృత్తాను సారిణీమ్। రూప దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ తారిణి దుర్గ సంసార సాగరస్యాచలోద్భవే । రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి ॥ ఇదం స్తోత్రం పఠిత్వా తు మహాస్తోత్రం పఠేన్నరః సప్తశతీం సమారాధ్య పరమాప్నోతి దుర్లభం ॥

...0...

కీలితం. యో నిష్కీలాం విధాయైనాం చణ్డీం జపతి నిత్యతః న సిద్ధః న గణః సోఽథ గన్ధర్వో జాయతే ధ్రువం. న చైవాపాటవం తస్య భయం క్వాపి న జాయతే, నాపమృత్యు వశం యాతి మృతే చ మోక్షమాప్నుయాత్. జ్ఞాత్వా ప్రారభ్య కుర్వీత హ్యకుర్వాణో వినశ్యతి, తతో జ్ఞాత్వైవ సమ్పూర్ణమిదం ప్రారభ్యతే బుధైః సౌభాగ్యాదిచయత్కిఞ్చి ద్దృశ్యతే లలనాజనే, తత్సర్వం తత్ప్రసాదేన తేనజప్య మిదం శుభం. శనైస్తు జప్యమానేఽస్మిన్ స్తోత్రే సంస్తురుచ్చకైః భవత్యేవ సమగ్రాపి తతః ప్రారభ్యమేవ తత్. ఐశ్వర్యం తత్ప్రసాదేన సౌభాగ్యారోగ్య మేవ చ శత్రుహానిః పరో మోక్ష స్తూయతే సా న కింజనైః. చణ్డికాం హృదయేనాపి యః స్మరేత్ సతతం నరః హృద్యం కామమవాప్నోతి హృది దేవీ సదా వసేత్। అగ్రతోఽముం మహాదేవకృతం కీలకవారణం, నిష్కీలంచ కథా కృత్వా పఠితవ్యం సమాహితైః.

శ్రీ భగవతీ కీలక స్తోత్రం సమాప్తమ్.

—0₀0—

# 1. కుండలినీ యోగ రహస్యం

## 1. ప్రస్తావన :

"పిండాండము బ్రహ్మాండము యొక్క సూక్ష్మరూప" మని విజ్ఞులు చెబుతారు. ఈ విశ్వంలో ఏ మహాశక్తి అణువులో నిక్షిప్తమై ఉన్నదో, ఆ మహాశక్తే కుండలినీ రూపంగా పిండాండములో ఉన్నది. శ్రీ చక్రం యంత్రదేహం. మంత్రం అక్షర దేహం. కాబట్టి యంత్రాన్నీ, మంత్రాక్షరాలనూ దేహాంతరాళంలో భావన చేసి, దేహశక్తికీ, దైవశక్తికీ భేదం లేదని మనం గుర్తించాలని భావనోపనిషత్తు చెబుతున్నది. మన పూర్వఋషులు ఆరోగ్యమంటే కేవలదేహ సంబంధమైనరోగాలు లేకుండా ఉండటం కాదనీ, మానసిక రుగ్మతలు కూడా లేకుండా ఉండటమే ననీ చెప్పారు. అటువంటి సంపూర్ణమైన ఆరోగ్యాన్ని ఏ విధంగా మనం సాధించాలో శాస్త్రీయంగా వాళ్ళు ప్రవచించారు. అదే కుండలినీ విద్య. దైహిక! మానసిక జాడ్యాలు లేని వాళ్ళే ఆత్మసాక్షాత్కారానికి అర్హులవుతారు. కుండలినీ విద్య శారీరక మానసిక శక్తులను ఏకోన్ముఖం చేస్తుంది. భౌతికవాదం ప్రబలిన రష్యావంటి దేశాల్లో కుండలినీ యోగాన్ని గురించి అనేక పరిశోధనలు చేసి సైంటిస్టులు కుండలినీ ప్రభావాన్ని దర్శించారు. వాళ్ళ పరిభాషలో కుండలిని అంటే "అటానమస్ నెర్వస్ సిస్టం" యొక్క పరధిని విస్తృత పరచటమే! తమ పరిశోధనా ఫలితాలతో వాళ్ళు ఈనాడు అనేక రోగాలను అత్యద్భుతంగా నిర్మూలించి రోగులకు స్వస్థత చేకూరుస్తున్నారు. కుండలినీశక్తికి కాశాచి స్థై, యోగభూమిగా

ప్రసిద్ధికెక్కిన మన దేశంలో మనం "కుండలిని" అనేది ఒకటున్నదన్న విషయాన్నే మరచిపోయి వెతలతో సతమతమైపోతున్నాం. ఇది విచారించ వగిన విషయం.

## 2. "కుండలిని" అంటే ఏమిటి ?

కుండలినీ శక్తి జ్ఞానస్వరూపిణీ, విమర్శరూపిణీయైన పరాశక్తి యొక్క అంశయేగాని వేరు గాదు. లలితాసహస్రనామాల్లో "మహాశక్తిః కుండలినీ బిసతంతు తనీయసీ" (కుండలినీ శక్తి తామరతూడులోని దారం లాగా అతి సూక్ష్మరూపిణి) అనీ, "మూలాధారైక నిలయా బ్రహ్మగ్రంథి విభేదినీ (మూలాధారంలో ఉన్న కుండలినీ శక్తి బ్రహ్మగ్రంథి భేదనం చేస్తుంది) అనీ చెప్పబడింది. కనీసం బ్రహ్మగ్రంథి భేదనమైనా జరగక పోతే జీవుడు పునర్జన్మనుంచి తప్పించుకోలేడు. చక్రభేదనం, గ్రంథి భేదనం ఈ కుండలినీ శక్తే చేస్తుంది. "సర్వేషాం యోగతంత్రాణాం తథాధారోహి కుండలీ." కనుక ఏవిధంగానైనా సరే ! కుండలినీ శక్తిని మనం జాగృతం చేసుకోవటం ఎంతైనా అవసరం. రోజుకు ఒక గంట చొప్పున నలభైరోజులు మనం సాధన చేస్తే ఈ కుండలినీశక్తిని మనం స్వాధీనం చేసుకోవచ్చు. "కుండలీ కుటిలాకారా సర్పవత్ పరికీర్తితా" అని సర్పంలాగా ఉంటుందని వర్ణించబడ్డ ఈ కుండలినీ శక్తిని ఎప్పుడుపడితే అప్పుడు తోకపట్టి మేల్కొల్పటంతో అది సహస్రార పర్యంతం పైకి లేస్తుంది. "బ్రహ్మచర్యరత స్యైవ నిత్యం హిత మితాశనః మండలా దృశ్యతే సిద్ధిః కుండల్య భ్యాసయోగినః" అని బ్రహ్మచర్య వ్రతదీక్షా పరుడై, నిత్యం హితమైన ఆహారాన్ని మితంగా భుజిస్తూ సాధన కొనసాగిస్తే నలభై రోజుల్లో ఈ కుండలినీ యోగసిద్ధి తప్పక లభిస్తుంది.

గృహస్థులు కూడా సాధన కాలంలో బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ సాధన చేసి ఈ స్థితిని పొందవచ్చు.

## కుండలినీ జాగృతివల్ల లాభాలు :

కుండలినీ శక్తి జాగృతం చెయ్యడంవల్ల మొట్ట మొదట శరీరం లోని రోగా లన్నీ నశిస్తవి. ఆ తర్వాత మానసిక జాడ్యం పరిహరింప బడుతుంది. శక్తి ప్రసారం కావటం వల్ల దేహంయావత్తూ పరిశుద్ధ మౌతుంది. యథార్థజ్ఞానం కలుగుతుంది. మనస్సు స్థిరపడుతుంది. సంకల్ప సిద్ధి అవుతుంది. కుండలినీ శక్తి వశమైతే పంచభూతాలు కూడా ఆసాధ కుడికి వశమౌతవి. స్వేచ్ఛా మరణం సంభవిస్తుంది.

## 3. గుప్తగాయత్రి (యోగగాయత్రి) :

గాయత్రీ మహామంత్రం 1. గుప్తగాయత్రీ 2. ప్రకటగాయత్రీ అని రెండు రూపాలుగా ఉన్నది. గుప్తగాయత్రిని "పరాగాయత్రీ," "సిద్ధగాయత్రీ" ఇత్యాదిగా వివిధనామాలతో పిలుస్తున్నారు. "ప్రకట గాయత్రీ" అంటే మనం మామూలుగా ఉపాసించే గాయత్రి అన్నమాట ! దాన్ని "కర్మ గాయత్రి" అని కూడా పిలుస్తారు. మనం చేసే ప్రతి కర్మనూ గాయత్రీ మంత్రాన్ని జపించియే చేయాలి. యోగసిద్ధిని పొందా లంటే మాత్రం, మనం యోగగాయత్రీ మంత్రాన్ని జపించవలసి ఉంటుంది. ఆ మంత్రాను ష్ఠానాన్ని బాగా గ్రహించి. అంతర్ముఖమైన మనస్సుతో ధ్యానిస్తే (ఈ మంత్రమే కాదు - ఏ మంత్రాన్నైనా మనంఅంతర్ముఖులమై ధ్యానించాలి) అది శీఘ్రఫలద మౌతుంది.

## 4. యోగ గాయత్రీమంత్రం (త్రిపద) :

ఓం; శ్రీం; హ్రీం; క్లీం; ఐం; సౌః; ఓం; హ్రీం; శ్రీం.
క, ఏ, ఈ: లః హ్రీం; హ, స, క, హ; లః హ్రీం; స, క: ల: హ్రీం.
సౌః: ఐం; క్లీం; హ్రీం: శ్రీం; ఓం, నమః.

## 5. కుండలినీ ధ్యానం :

"ఉత్తిష్ఠ హే జగన్మాతా ! సర్వమంగళదేవతే!
భక్తహృన్మందిరోపేతే ! సర్వసిద్ధిప్రదాన్వితే॥
ఐం నమః శ్రీమహాకాళ్యైమహాశక్త్యై నమో నమః
మూలధారస్థితాయై శ్రీకుండలీశక్తయే నమః॥
ఆరోహాయ మహాకాళీ మమ మాత ర్మహేశ్వరీ
మూలాధారస్థితే చక్రే ఉపవిశ్య సుఖాసనే॥
మయా దత్త మిమాం పూజాం గృహాణ పరమేశ్వరీ
దుర్వాసన సమూహాంశ్చ భస్మీకురు కృపామతే ॥
సుషుమ్నానాడి మధ్యస్థే స్వాధిష్టానాఖ్యవారిజే
ఆసీనాభవ మే మాతా సర్వాలంకారశోభితే॥
త్వత్పాదాంభోరుహ ద్వంద్వేమేఽస్తు భక్తి రహైతుకం
దేహి మే దృఢవైరాగ్యం దేహ్యద్వైతావలోకనం ॥
శనై శ్శనై రుపరి మే గత్వా మణిపూరకవారిజే
నాభిస్థాన పురం సంస్థం సుందరం సువిరాజితం ॥

తత్ర స్థిత్వా సుప్రసన్నా వరదాభవ శాంకరీ
దూరీకురు ప్రమాదం చ శోక మోహాభయాని చ॥
అనాహతాబ్జ నిలయే యత్తిష్ఠత్వా హరప్రియే
ఛింది సర్వాంశ్చ హృద్గ్రంథిం కర్మబీజాని దాహయన్ ॥
క్షమస్వ మాతర్మే మహాపచారాన్ కృతాన్ వాక్కరజైః సమస్తాన్
కృపాకటాక్షాణి ప్రసారయత్వా రక్షస్వ మాం త్వచ్ఛరణం ప్రసన్నం ॥
కంఠదేశ విరజిత్వా విశుద్ధాహ్వాయ పంకజం
ఉపగమ్య పరాదేవి దేహి పుత్రాయ సన్నిధిమ్ ॥
ప్రదర్శయ స్వతేజో మే స్వప్రకాశ స్వరూపిణీమ్
ప్రతిష్ఠాపయ మే వాచి తవనామ నిరంతరం
ఆజ్ఞాపత్రే వివరే కమలే ఆరూఢయ జగదంబ మదంబా
ముక్తికవాటం దర్శయ పాలయమాం తవపుత్ర మజస్రం॥
శుద్ధ సత్వాత్మికే దేవి బ్రహ్మ విద్యాస్వరూపిణి
ప్రవేశయ కృపాపూర్ణే సమ్యక్ భిక్ ఊర్ధ్వకుండలీం॥
సుషుమ్నాంత సహస్రారం నిరావరణ సంజ్ఞికం
కోటిసూర్యప్రకాశం చ సహస్రదళ సంయుతం॥
దహరాగ్రే పుండరీకే సుఖాసీనా భవేశ్వరీ
ఐక్య మిచ్ఛా మితే మాతా భవత్పాదారవిందయోః
సాయుజ్యం దేహి పుత్రాయ సాయాప్యాతిష్ఠితాయ చ
యస్మాత్కారణయా దేవీ యావన్మే దేహి సంస్థితా ।
అహం బ్రహ్మేతి విజ్ఞాన మేస్తు నిర్వాణరూపిణీ

జ్ఞా త్వా తమే వాసి జ్ఞానం త్వ మేవా
ద్రష్టా త్వమే వాసి దృశ్యం త్వ మేవా
కర్తానుమంతా చ భోక్తా త్వ మేవా
త్వమేవ నిర్గుణబ్రహ్మ త్వమేవ సగుణేశ్వరీ
త్వమేవ విశ్వం భువనం త్వమేవాహ న సంశయః
నా స్తి దేహో న సంసారీ న జీవో నా స్తి కర్మణః
న కర్తాహం న భోక్తాహం న గతి ర్బంధ మోక్షయః
అహమేవ పరంబ్రహ్మ అహ మేవాస్మి జగత్రయం
అద్వితీయో హ్యానంతోహం సచ్చిదానంద మస్మ్యహం
మంగళం శ్రీమహాకాళీ మహావాణీ చ మంగళం
మంగళం శ్రీ మహాలక్ష్మి మంగళం శ్రీశివాత్మికే

## 6. కుండలినీ జపవిధి :

యోగ గాయత్రీ మంత్రంలోని బీజాక్షరాలు జపించేటప్పుడు మన మనస్సును మన దేహంలోని ఆయా చక్రస్థానము లందుంచి, నాభిని పొట్టలోకి లాగుతుండాలి. లేదా గుదస్థానమునైనా బిగపట్టుతుండాలి. ఇట్లా మూడు పాదములలోని మంత్ర బీజాలను జపిస్తూ, ఒక గంట సాధన చేస్తే కుండలిని జాగృతమౌతుంది. మంత్ర బీజాక్షరాలను మనస్సులోనే మౌనంగా జపించాలి.

మొదటిపాదము—తొమ్మిది అక్షరములు—తొమ్మిదిసార్లు జపము.

1. శిరస్సు పైభాగమున (సహస్రారమున) మనస్సు ఉంచి ఓం అనవలెను.

2. హృదయమందు (అనాహతమున) మనస్సు ఉంచి "శ్రీం" అనవలెను.

3. కంఠకూపమున (విశుద్ధమున) మనస్సు ఉంచి "హ్రీం" అనవలెను.

4. నాభికి నాలుగు అంగుళముల దిగువ(స్వాధిష్ఠానమున) మనస్సు ఉంచి "క్లీం" అనవలెను.

5. నాభియందు (మణిపూరమున) మనస్సు ఉంచి "ఐం" అనవలెను.

6. వెన్నెముక క్రింది కొనయందు (మూలాధారమున) మనస్సు ఉంచి "సౌః" అనవలెను.

7. శిరస్సు పై భాగమున (సహస్రారమున) మనస్సు ఉంచి "ఓం" అనవలెను.

8. కంఠమున (విశుద్ధమున) మనస్సు ఉంచి "హ్రీం" అనవలెను.

9. హృదయమందు (అనాహతమున) మనస్సు ఉంచి "శ్రీం" అనవలెను.

రెండవ పాదము—15 అక్షరములు—9 సార్లు జపము.

1. హృదయమున (అనాహతమున) మనస్సు ఉంచి "క, ఏ, ఈ" అనవలెను.

2. నాభికి నాల్గు అంగుళముల దిగువ (స్వాధిష్టానమున) మనస్సు ఉంచి "ల" అనవలెను.

3. శిరస్సు పై భాగమున (సహస్రారమున) మనస్సు ఉంచి "హ్రీం" అనవలెను.

4. హృదయమున (అనాహతమున) మనస్సు ఉంచి "హ, స క, హ" అనవలెను.

5. నాభికి దిగువ (స్వాధిష్టానమున) మనస్సుఉంచి "ల" అనవలెను.

6. శిరస్సు పైభాగమున(సహస్రారమున) మనస్సుఉంచి "హ్రీం" అనవలెను.

7. హృదయమున (అనాహతమున) మనస్సు ఉంచి "స,క" అనవలెను.

8. నాభికి దిగువ (స్వాధిష్టానమున) మనస్సు ఉంచి "ల" అనవలెను.

9. శిరస్సు పై భాగమున (సహస్రారమున) మనస్సు ఉంచి "హ్రీం" అనవలెను.

3వ పాదము—8 అక్షరములు—6 సార్లు జపము

1. వెన్నెముక చివరికొనన (మూలాధారమున) మనస్సు ఉంచి "సౌః" అనవలెను.

2. నాభియందు (మణిపూరమున) మనస్సు ఉంచి "ఐం" అనవలెను.

3. నాభికి దిగువ (స్వాధిష్ఠానమున) మనస్సు ఉంచి "క్లీం" అనవలెను.

4. కంఠమున (విశుద్ధమున) మనస్సు ఉంచి "హ్రీం" అనవలెను.

5. హృదయమున (అనాహతమున) మనస్సు ఉంచి "శ్రీం" అనవలెను.

6. శిరస్సుపైన (సహస్రారమున) మనస్సు ఉంచి "ఓం, నమః" అనవలెను

ఇట్లు మూడుపాదములలోని బీజాక్షరములను క్రమముగా, మౌనముగా జపించిన ఒకసారి జపము చేసినట్లగును. మరల మొదటి పాదములోని బీజాక్షరములతో జపము ప్రారంభించి, మూడుపాదములలోని బీజాక్షరములను జపించవలెను. ఇట్లు కనీసము 108 సార్లు ప్రతిదినము జపము చేయవలెను. ప్రారంభమున జపసంఖ్య రోజుకు కనీసము 11 పర్యాయములు చేయుచు, క్రమక్రమముగా జపసంఖ్య పెంచుచు ఒక గంట (లేదా 108 పర్యాయములు) జపముచేయు స్థితిని పొందవలెను.

## 7. సాధకులు పాటించవలసిన అంశములు :

సాధనచేయు కాలమందు శాఖాహారులై ఉండవలెను. సాధ్యమైనంతవరకు వాక్సంయమనము కలిగిఉండవలెను. ఉద్రేకము కలిగించు పుస్తకములు చదువరాదు-సినిమాలు చూడరాదు. ఇతరులను విమర్శించరాదు-కఠినముగా మాట్లాడరాదు-త్రికరణశుద్ధి కలిగి ఉండవలెను. విధిగా బ్రహ్మచర్యము పాటించవలెను. సర్వభూతదయ, విశ్వప్రేమ కలిగి ఉండవలెను. సాధనచేయు ప్రదేశము ఏకాంతముగా నుండవలెను. మెత్తని

ఆసనము సమకూర్చుకొనవలెను. అది మిక్కిలి ఎత్తుగా ఉండరాదు. జపము చేయు సమయమున వెన్నెముక వంగి ఉండరాదు. నిటారుగా కూర్చుండవలెను. కన్నులు మూసుకొని ఉండవలెను. ప్రారంభ సమయములలో బీజాక్షరములు జపించునప్పుడు ఏ చక్రస్థానమున మనస్సునుంచవలెనో తెలియదు గనుక పుస్తకము చూచి గుర్తు పట్టుకొనవలసి యుండును. కనుక మొదట పుస్తకము చూచి జపము చేయుచు క్రమముగా కన్నులు మూసుకొని జపముచేయు స్థితిని సాధించవలెను. జపసమయమున నాభిని పొట్టలోనికి లాగుచుండవలెను. లేదా గుదమును బిగపట్టి ఎగ లాగుచుండవలెను. ఇట్లు చేయుచుండిన క్రమముగా కుండలిని జాగృతము కాగలదు. భోజనము చేసిన వెంటనే సాధన చేయరాదు. భోజనము చేసిన తర్వాత కనీసము 4 గంటలైనను విరామ ముండవలెను. ప్రాతఃకాలము లేదా అర్ధరాత్రి జపమునకు మంచిది.

## 8. వినాయకుడు-కుండలిని :

ఏ కార్యాన్ని మనం చెయ్యాలనుకొన్నా ఓం ప్రథమం విఘ్నేశ్వరపూజ చేయటం ఒక ఆచారంగా మనకు వస్తున్నది. ఆనవాయితీ ప్రకారం చెయ్యటమేగాని ఈ ఆచారం ఎందుకు వచ్చిందో చాలామందికి తెలియదు. ఏ కార్యాన్ని సాధించటానికైనా మనకు శక్తి కావాలి. ఒక్క శక్తి ఉండగానే సరిపోదు. బుద్ధికూడా సక్రమంగా పనిచెయ్యాలి. అప్పుడుగాని కార్యం సిద్ధించదు. మనకు కావలసిన శక్తినీ, స్థిరమైన బుద్ధినీ కుండలిని ప్రసాదిస్తుంది. ఆ శక్తిని పొందటం కోసమే మనం విఘ్నేశ్వర పూజ చేస్తున్నాం. ఆ స్వామికి బుద్ధిసిద్ధులు భార్యలని చెప్పటంలోని అంతరార్థం ఇదే! మూలాధార చక్రంలో వినాయకుడుంటాడని చెప్పటానికి కారణం కూడా ఇదే!

మానవుడి శిరస్సునూ, వెన్నెముకనూ, శరీరం యొక్క వెనుక భాగంనుండి చూస్తే అది ఏనుగుతల, తొండమువలె ఉన్నట్లు కనిపిస్తుంది. ఈ తొండము చివరే మూలాధారము. తొండము విఘ్నేశ్వర శక్తికి స్థానము. మానవుని వెన్నెముక చివర ఉన్న మూలాధారమందలి కుండలినీ శక్తియే యోగశక్తి. ఆ శక్తిని మనం సిద్ధింపజేసుకోవాలని సూచించడానికి ఈ విఘ్నేశ్వరపూజ ఒక సంప్రదాయంగా వెలిసింది.

కుండలినీ ఆకారం సర్పంగా ఉండటం, ఆ శక్తి సుబ్రహ్మణ్యస్వామి (కుమారస్వామి) అని మనకు వ్యక్తంజేస్తుంది. "శక్తిధరు"డనే ఆయనకు గల నామాంతరం ఈ విషయాన్ని మరింత బలపరుస్తుంది. కుండలినీశక్తి షట్చక్రాలద్వారా పయనిస్తూ-ఆయా స్థానాల్లో అమృతపానం చేస్తున్న కారణంచేత సుబ్రహ్మణ్యస్వామికి "షణ్మాతురు" డని పేరు వచ్చింది. కుండలినీ శక్తికి స్థానమైన మూలాధారం, పరాశక్తి కుమారులైన గణపతి, షణ్ముఖు లిద్దరికీ మూలస్థానం కావటం మనం గమనించవలసిన విషయం.

## 9. రామాయణం - కుండలినీ :

రామాయణ కావ్యాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే అది ఒక కుండలినీ యోగశాస్త్ర గ్రంథంగా మనకు గోచరిస్తుంది. రాముడికి కలిగిన సీతా వియోగం-పరమాత్మ అంశమైన జీవాత్మకు కలిగిన కుండలినీశక్తి వియోగమే! ఆంజనేయుడు రాముడు పంపగా సీతాదేవిని అన్వేషిస్తూ పోయి, చివరకు లంకలో సీతాదేవిని కనుగొంటాడు. "కుండలినీ యోగసిద్ధి పొందిన వాని అనుగ్రహంవల్ల సాధకుడు కార్యసిద్ధిని పొందుతా"డనే విషయాన్ని ఇది వెల్లడిస్తుంది. రామరావణ సంగ్రామం-ఆత్మ, అనాత్మల విచారణమే గాని వేరు గాదు. సీతాదేవి అగ్నిప్రవేశం చేసి, శ్రీరాముణ్ణి

తిరిగి పొందటం, యోగసాధకునిచే పొందబడిన కుండలినీశక్తి, స్వాధిష్ఠానమున గల అగ్నిచే సంతప్తమై ఆ పిదప సహస్రారములోనున్న కేవలాత్మను కలుస్తుం"దన్న విషయాన్ని వెల్లడిస్తుంది. సీతారాముల పట్టాభిషేకం-సాధకుడు యోగశక్తిని సహస్రారమున నిలబెట్టుకోవటాన్ని సూచిస్తుంది. నిద్రావస్థలోనున్న కుండలినీ శక్తియే శ్రీరాముణ్ణి విడిచిన సీత. రావణాసురుడు అహంకారానికీ, అజ్ఞానానికీ చిహ్నం. జనకమహారాజు గొప్పజ్ఞాని. ఆయన యోగమనే భూమిని (యోగభూమిని) దున్నుతుంటే ఆ సాధనలో మహాలక్ష్మీ స్వరూపిణియైన సీత లభించింది. ఆమెను ఆయన శ్రీరాముడికి సమర్పిస్తాడు. సీత రాముణ్ణి వరిస్తుంది. ఈ విధంగానే కుండలినీ యోగికి యోగశక్తియైన కుండలిని అతని సాధనలో లభిస్తుంది. దాన్ని ఆ సాధకుడు సహస్రారంలోని కేవలాత్మకు సమర్పించుకుంటాడు. సీతారాములకు చివరికి అయోధ్యారాజ్యము లభించినట్లే కుండలినీయోగికి మహాశక్తులూ, మహాసిద్ధులూ లభిస్తాయి. శ్రీ సీతారాములు తమ అవతారాలు చాలించి వైకుంఠాన్ని చేరుకున్నట్లే, కుండలినీయోగికూడా పరమబ్రహ్మ స్వరూపుడై మోక్షసామ్రాజ్యాధిపతి ఔతాడు. ఇట్లా రామాయణం యావత్తూ కుండలినీ యోగశాస్త్రంగా మనకు దర్శన మిస్తుంది.

**తుదిపలుకు :**

బీజాక్షరజపం చేసేటప్పుడు కుండలినికి కదలిక కలిగి కొన్ని స్పర్శలు కలుగుతున్న అనుభవాలు (చీమలు ప్రాకుతున్నట్లూ, గిలిగింతలు పెడుతున్నట్లూ, ఝల్లుమని వొళ్ళు జలదరించినట్లూ, తలపై బరువు పెట్టినట్లూ ఇత్యాది) స్ఫురించినప్పుడు "సౌః, ఐం, క్లీం, హ్రీం, శ్రీం" అనే మంత్రాన్ని కొంతసేపు సాధకుడు మౌనంగా జపిస్తూ, తన మనస్సును ఆయా చక్రస్థానాల్లో నిలుపుతూ ఉంటే, కుండలిని త్వరగా మేల్కొ

కొంటుంది. జపం చేస్తున్నప్పుడు శిరస్సు పైభాగమున పెద్దబరువు పెట్టి నట్లు అనిపించేవరకూ ప్రతిరోజూ జపం చెయ్యాలి! జపం చాలించి, ఒక సారి తలను అటూ ఇటూ కదిలిస్తే, శిరోభారం మొత్తం చేత్తో తీసివేసినట్లు మాయమై పోతుంది. కుండలినీశక్తి మళ్ళీ తన స్వస్థానమైన మూలాధారానికి చేరుకొంటుంది. శిరస్సుకు చేరిన కుండలిని స్వస్థానమునకు చేరటంతోనే శరీరంలోని నాడు లన్నీ శుద్ధి ఔతవి. మనస్సు ప్రశాంతమౌతుంది. కుండలినీశక్తి శిరస్సున చేరి ఉన్న సమయంలో సాధకుడికి కొన్ని అద్భుత శక్తులు కలుగుతవి.

"ఉద్ఘాటయే కవాటం తు యథా కుంఛిక యా హఠాత్
కుండలిన్యా తథా యోగి మోక్షద్వారం విభేదయేత్"

గొడ్డళ్ళతో పగులగొట్టాలని ఎంత ప్రయత్నించినప్పటికీ పగులని తాళాన్ని, తాళంచెవితో సునాయాసంగా తెరువగలిగినట్లు, అత్యంత దుర్లభమైన మోక్షద్వారాన్ని కుండలినీశక్తిని జాగృతంచేయగల యోగి సునాయాసంగా తెరచి మోక్షాన్ని చూరగొంటాడు.

మన ప్రాచీన ఋషులు ఈ కుండలినీశక్తిని పుష్కలంగా పొంది ఉండటంచేతనే ఆధ్యాత్మిక జ్ఞానదాతలుగా వాసి గాంచారనీ, మనదేశం వాళ్ళమూలంగానే యోగభూమిగా ప్రసిద్ధివహించిందనీ గ్రహించి, ఆ మహర్షుల సంతతికి చెందిన మనంగూడా ఆ సంప్రదాయం వదిలిపెట్టక సాధనచేసి-శక్తివంతులమై, సర్వబాధలనుంచి విముక్తిపొంది, లోకంలో సుస్థిరశాంతికి పునాదులు వేయాలి! విశ్వకళ్యాణానికి పూలబాటలు పరచాలి! ఆ సమయం చేరువలోనే ఉందని ఆశిద్దాం!

సర్వేజనాః సుఖినో భవంతు

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# శ్రీ చండికా ధ్యానము

ఓం బన్ధూక కుసుమాభాసాం పఞ్చ ముణ్డాధివాసినీమ్
స్ఫురచ్చన్ద్రకలా రత్న మకుటాం ముణ్డమాలినీమ్॥
త్రినేత్రాం రక్తవసనాం పీనోన్నత ఘట స్తనీమ్
పుస్తకం చాక్షమాలాం చ వరం చాభయకరం క్రమాత్
దధతీం సంస్మరే న్నిత్య ముత్తరామ్నాయ మానితామ్॥

యా చణ్డీ మధుకైటభాదిదలనీ, యా మాహిషోన్మూలినీ
యా ధూమ్రేక్షణ చణ్డముండ మథనీ యా రక్తబీజాశనీ
శక్తిః శుంభనిశుంభ దైత్య దమనీ యా సిద్ధి దాత్రీ పరా
సా దేవీ నవకోటిమూర్తి సహితా మాం పాతు విశ్వేశ్వరీ॥

